"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక"— ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ వస్తువైనా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మరికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మలైనా చేసెయ్యండి"

సీతాకోక చిలుక ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.




ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్

బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది, ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది

® అనే మరియు ఫెవికాల్ బ్రాండ్ పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్స్ గలవి.

OBM-1214 TL

# వనిత

డాల్టన్ ప్రచురణ

దశాబ్దానికి పైగా మూడు భాషలలో
వెలువడుతూ వనితల
పురోభివృద్ధికి పాటుబడుతున్న
ఏకైక స్త్రీజన మాసపత్రిక!




డిసెంబర్
1986




జూలై
1975

నేడే చందాదారులుగా చేరండి
మీలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే
మీ నెచ్చెలి
**వనిత**
మీ ముంగిటికే రప్పించుకోండి!

సాలు చందా: రూ 36

ఎం.ఓ. ద్వారాగానీ బ్యాంక్ డ్రాఫ్టు ద్వారాగానీ పంపవలసిన చిరునామా

వనిత (తెలుగు), డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు—600 026

## పాల బిస్కట్లు–
## నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!




రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

బ్రిటానియా

LINTAS BIN MB 12

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["గుణశేఖరుడి కథ"]కు ఆధారం, లక్ష్మిగాయత్రి రచన. మనిషికి ఎందులోనైనా అభిరుచివున్నంత మాత్రాన చాలదు; ఉత్తమాభిరుచి అవసరం. ముఖ్యంగా కళల విషయంలో, యిది బాగా వర్తిస్తుంది. అదిలేనివాడు, తన మిడిమిడి జ్ఞానంతో వాటిని విమర్శించబూనుకుని, ఎలా నవ్వుల పాలు కాగలడో, ''గ్రామాధికారి రసహృదయం'' అన్న కథలో మనం తెలుసుకుంటాం.

## అమరవాణి

అర్థనాశం, మనస్తాపం, గృహే దుశ్చరితాని చ,
వంచనం చాపమానం చ, మతిమాన్ న ప్రకాశయేత్.

[వివేకవంతుడు ధననష్టాన్ని, మానసికబాధనూ, కుటుంబానికి సంబంధించిన అపనిందనూ, తను అనుభవించిన వంచననూ, అవమానాన్ని బయటికి చెప్పకోడు.]

సంపుటి 81 సెప్టెంబర్ '87 సంచిక 3

విడి ప్రతి : 2-50 : : సంవత్సర చందా : 30-00





కామిక్స్ అన్నవి ఇక బోర్ బోర్
రవి అనుకున్నాడు చెయ్యాలనేదో వేరేవేరే
తనంతటతానే సరదా తీరేలా
ఇతరులు చూసి మురిసిపోయేలా
ఆ! ఈ ఎకో పెన్నులసెట్ నాకు జోడీ
గీసేస్తా నేనింక కూసే ఓ కోడి
అల్లరి పిల్లల బడి, రెండు జడల జోడి.
నాన్న పెంచే మీసం, అమ్మ చేసే పకోడి.
ఎకో పచ్చ ఎకోనీలం
ఎరుపు పసుపు నారింజ రంగుల మయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓ సెట్




# ఎకో

స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

ప్రీమియర్ రైటింగ్ పాయింట్స్(ప్రైవేట్) లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలె పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.
ఫోన్: 6040305, 6043556.

## చందమామ కబుర్లు



### మికీ సాహస యాత్ర!

ప్రపంచంలో మరే పిల్లీ చేయని ఘన కార్యాన్ని మికీ అనే పిల్లిపిల్ల చేసింది. జపానుకు చెందిన జునిచీసూగా అనే పోలీసు అధికారి పొరపాటున తన పెంపుడు ఆడపిల్లి మికీని ఇంటికి 370 కి. మీ. దూరంలో వదిలిపెట్టివచ్చేశాడు. అయితే, ఆ మికీ 19 నెలలపాటు ఒంటరిగా ప్రయాణంచేసి, యజమాని ఇల్లు చేరుకున్నది।

### కల నిజం చేసిన పట్టుదల!



పశ్చిమ జర్మనీకి చెందిన 29 యేళ్ళ ఆంద్రీస్ అనే యువకుడు భారతదేశం వంటి ఇతర దేశాలను పర్యటించాలని కలలుగనే వాడు. అయితే రోడ్డు ప్రమాదంవల్ల అతడి రెండు కాళ్ళూ పడిపోయాయి. అయినా అతడు తన ఆశను వదులుకోలేదు. చక్రాల కుర్చీమీదే పట్టుదల వదలకుండా ఇండియా వంటి దేశాల మీదుగా 50,000 కి. మీ. దూరం ప్రయాణం చేశాడు।



### ఉక్కును కత్తిరించే ఉత్తమ ఆయుధం!

ఏమిటది? ఉక్కు రంపమా? వజ్రమా? కత్తా? వీటిలో ఏవీ కావు. నీళ్ళు! పెంట్రుకంత వలుచగా వున్న నీటి ధారను, మూడింతల ధ్వని వేగంతో విసిరినట్టయితే—అది ఉక్కును మరే ఆయుధంకన్నా మరింత మృదువుగా కత్తిరిస్తుంది.

### బడిపిల్లవాడి 'భస్మ' హస్తం!



ఉక్రేనియాకు చెందిన 13–ఏళ్ళ బడిపిల్లవాడు ఏది తాకినా భగ్గుమంటున్నది. అతడు ముట్టుకోవడంవల్ల బట్టలు, పుస్తకాలు, బీరువాలు ఇలా ఎన్నో మంటలపాలయ్యాయి. ఈ విచిత్ర పరిణామానికి అమితాశ్చర్యం చెందిన సోవియట్ విజ్ఞానవేత్తలూ, వైద్యులూ పరిశీలనకోసం ఆ కుర్రవాణ్ణి ఆస్పత్రిలో వుంచి పర్యవేక్షిస్తున్నారు।

పురాణగాథలు :

# నిశాకరుడు

దండకారణ్య సమీప మునివాటికలో నివసించే ధర్మిష్ఠకు నిశాకరుడనే కొడుకు వుండేవాడు. వాడు అనాకారి, మందమతి; అల్లరిపనులు చేసేవాడు.

ఒకనాడు నిశాకరుడు హఠాత్తుగా కనిపించకుండా పోయాడు. వాడి తల్లి ఎక్కడెక్కడో వెదికింది. కాని, వాడి జాడ తెలియలేదు. ఏ పులో, క్రూరమృగమో వాణ్ణి ఎత్తుకుపోయివుంటుందని ఇరుగుపొరుగు వాళ్ళు చెప్పారు. ధర్మిష్ఠ గుండె నిబ్బరంతో కాలం గడపసాగింది.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ధర్మిష్ఠ ఒకనాడు, మునివాటికగుండా వెళుతూ, దారి పక్కన వున్న బావినుంచి మానవ కంఠస్వరం వినిపించడం గమనించింది. ఆమె బావిమీద ఒక బండ వుండడం చూసి, "ఈ బండతో బావిని ఎవరు మూశారు?" అని ఆశ్చర్యంతో బావిలోకి తొంగి చూసింది.

బావిలోనుంచి నిశాకరుడు 'అమ్మా', అని పిలిచాడు. తన కొడుకు కంఠస్వరాన్ని గుర్తుపట్టిన ధర్మిష్ఠ, వెంటనే ఇరుగుపొరుగులను సాయం పిలిచి, బావికి అడ్డుగా వున్న బండను తొలగించి, నిశాకరుణ్ణి పైకి తీసింది।

నిశాకరుడి అల్లరిపనులకు సహించలేనివాళ్ళెవరో, అతణ్ణి బావిలోకి తోసి, మళ్ళీ పైకి రానీయకుండా పెద్ద బండను అడ్డు పెట్టారు। బావిలో పడిన నిశాకరుడు, నీళ్ళ పైభాగంలో అల్లుకుని వున్న చెట్ల, తీగల ఫలాలనూ, కందమూలాలనూ తింటూ, తనకీ దుర్గతి ఎందుకు పట్టిందో తీవ్రంగా ఆలోచించసాగాడు. ధ్యానఫలితంగా, అతనికి క్రమక్రమంగా తన పూర్వ జన్మల వృత్తాంతాలు తెలియవచ్చాయి. పూర్వజన్మల పాపఫలితంగానే తనకీ గతి సంప్రాప్తమయినట్టు గ్రహించాడు. నిర్మలమైన మనస్సుతో పైకి వచ్చారు. ఆ తరవాత కఠినమైన తపస్సు ఆచరించి, గొప్ప మునిగా, త్రికాలజ్ఞానిగా కీర్తిగాంచాడు।





# తాయెత్తు మహిమ

గంగరాజనే గజదొంగ, రాజుగారి ధనాగారాన్ని దోచుకుని, దాన్ని తన రహస్య స్థానంలో దాచి, దొంగను పట్టుకోవడానికి, రాజు ఎటువంటి ప్రయత్నాలు చేస్తున్నాడో తెలుసుకోవడానికి, మారువేషంలో తిరిగి రాజధానికి వచ్చాడు.

వాడు ఒక సత్రం ముందుగా పోతూండగా, సత్రం అరుగు మీద ఒక సాధువు నిద్రపోతూండడం కనిపించింది. సాధువులు ఎన్నో మహిమలు కలిగి వుంటారనీ, వాళ్ళ దగ్గిర వుండే ప్రతి వస్తువుకూ ఏదో ఒక మహిమ వుంటుందనీ, గంగరాజు విని వున్నాడు. అందుచేత వాడు మెల్లగా, సాధువును సమీపించి, అతడి దగ్గిర ఏవైనా మహిమగల వస్తువులు దొరుకుతాయేమో అని జాగ్రత్తగా వెతికాడు. వాడికి సాధువు ముంజేతికి వున్న తాయెత్తు ఒకటి కనిపించింది. దాన్ని మెల్లిగా విప్పి, గంగరాజు తన ముంజేతికి కట్టుకున్నాడు.

ఆ వెంటనే వాడు, ''గజదొంగ గంగరాజును, నేనే! రాజుగారి ధనాగారాన్ని దోచుకున్నదికూడా, నేనే!''అని అరిచాడు.

తనకు తెలియకుండానే, తన నోటి నుంచి నిజం బయటపడేసరికి వాడు హడలిపోయి, తాయెత్తును ఊడదీసి దూరంగా విసిరివేశాడు. కాని, అది పోయిన వేగంలో తిరిగివచ్చి వాడి చేతికి చుట్టుకున్నది. ఇలా రెండు, మూడుసార్లు చేసి గంగరాజు విసిగిపోయాడు. ఈ లోపల వాడి కేకలు విని, అటువైపు వెళుతున్న రాజభటులు వచ్చి, వాణ్ణి రాజుదగ్గిరకు లాక్కుపోయారు.

రాజు, భటులు చెప్పింది విని, ''ఏ దొంగ కూడా, తాను దొంగనని చెప్పుకోడు. అయినా, వీడి స్థావరానికి వెళ్ళి చూసి

మల్లవరపు మనోహరరెడ్డి



రండి. వీడు అబద్ధం చెప్పి వుంటే, తల కొట్టించి కోట గుమ్మానికి వేలాడ దీయిస్తాను," అన్నాడు.

భటులు, గంగరాజుతో వాడి స్థావరానికి వెళ్ళి, వాడు దోచుకుపోయిన ధనంతో తిరిగి వచ్చారు.

రాజు ఆశ్చర్యపడి, "వీడు గజదొంగ గంగరాజనేదాంట్లో ఎటువంటి సందేహం లేదు. అయితే, వీడు నిజం చెప్పడంలో, ఏదో కిటుకున్నది. అది బయటపడేంత వరకూ, వీణ్ణి ఖైదులో వుంచండి," అన్నాడు.

ఆ రాత్రి గంగరాజు, కారాగారానికి కాపలా వున్న భటుడితో మెల్లగా మాటలు కలిపి, "ఈ తాయెత్తు గొప్ప మహిమలు కలది. ఒకసారి కట్టుకుని చూడు, దీని సంగతి నీకే తెలుస్తుంది," అన్నాడు.

భటుడు తాయెత్తు కట్టుకుని వెంటనే, "కాపలా సమయంలో, నేను నిద్రపోతూంటాను. అయినా, ఎవరూ నేను నిద్రపోతున్నట్టు తెలుసుకోలేరు. దానికి కారణం, నేను కళ్ళు తెరుచుకునే గాఢనిద్రపోగలను," అన్నాడు.

భటుడి రహస్యం తెలుసుకున్న గంగరాజు, ఒక రాత్రివేళ, కారాగారం తలుపు చువ్వలు విరిచి పారిపోయాడు.

తెల్లవారాక జరిగింది తెలుసుకున్న కాపలాభటుడు, రాజు దగ్గిరకు పోయి, "గజదొంగ గంగరాజు పారిపోయాడు. ఆ పారిపోయింది, నావల్లనే," అని చెప్పాడు.

ఆయన భటుడు చెప్పింది విని కోపంగా, "గంగరాజును, నువ్వెందుకు పారిపోనిచ్చావు?" అని అడిగాడు.

"ప్రభూ, వాడిచ్చిన తాయెత్తువల్ల, నా మనసులో వున్న రహస్యం వెంటనే బయటపెట్టేశాను," అని భటుడు తన చేతికి వున్న తాయెత్తును వూడదీసి, రాజుకు యిచ్చాడు.

రాజు దాన్ని దూరంగా విసిరివేశాడు. అయితే, తాయెత్తు వెంటనే వచ్చి, రాజు

చేతికి చుట్టుకున్నది. ఇంకొకరు తీసుకో నిదే, అది వదలదని తెలుసుకున్న రాజు, ఒక రోజుపాటు దాన్ని తన వద్దనే వుంచు కుని, తన మీద ప్రజలకూ, ప్రభుత్వోద్యో గులకూ ఎలాంటి అభిప్రాయం వున్నదో తెలుసుకోదలిచాడు.



ఆ మర్నాడు, ఆయన సభ చేసి, సభికుల్లో నుంచి ఒకణ్ణి పిలిచి, వాడి చేతికి తాయెత్తు కట్టాడు. వెంటనే వాడు, పెద్దగా గొంతెత్తి, "ప్రజలపై అధిక పన్నులభారం మోపకుండా పాలించ గలిగిననాడు, నిన్ను మహారాజుగా గుర్తించ గలం!" అన్నాడు.

తర్వాత రాజు తాయెత్తును, ఒక భటు డికి కట్టాడు. వాడు, "చాలీచాలని వేతనం యిచ్చి, గొడ్డుచాకిరీ చేయిస్తున్న, యీ రాజంటే పరమద్వేషం!" అన్నాడు.

చివరకు సేనాపతి తాయెత్తు కట్టుకుని, "విలాసవంతమైన రాజు జీవితం అంటే, నాకెంతో యిష్టం. ఏ సింహాసనమైనా అధిష్ఠించగలిగే అదృష్టం వుంటే, ఎంత బావుంటుంది!" అన్నాడు.

ఈ సంఘటనతో రాజుకు మనసు చెడి, ఆ రాత్రి నిద్రపట్టలేదు. ప్రజాక్షేమం కోసం, తానెన్నో మంచి పనులు చేస్తున్నప్పటికీ, వాళ్ళకు తనంటే గౌరవం లేదు. మును పెన్నడూ లేనంతగా వేతనం యిచ్చి నప్పటికీ, ఉద్యోగులకూ, నమ్మకంగా మెలిగే సేనాపతికీ కూడా—ఏదో ఒక కారణంగా తనంటే ద్వేషమే! వీళ్ళనా, తనింతకాలంగా నమ్ముతూ వస్తున్నది, అని ఆయన రాత్రంతా బాధపడుతూ గడిపాడు.

తెల్లవారగానే ఆయన, మంత్రికి కబురు పంపి, జరిగింది చెప్పి, "నాకెందువల్లనో, రాజ్యపాలనపట్ల విరక్తి కలుగుతున్నది," అన్నాడు.

మంత్రి చిరునవ్వునవ్వి, "ప్రభూ, దీనికంతకూ, ఆ తంపులమారి తాయెత్తు కారణం. మీరు మనుషుల్లోని మర్మం, ఒడ్డున వుండి నీళ్ళ లోతూ తెలుసుకోవా

లనుకోవడం పెద్ద పొరబాటు. ముందు, మీరా తాయెత్తును వదిలించుకోండి. తర్వాత అన్నీ వాటంతటవే చక్కబడతాయి," అన్నాడు.

రాజుకు, యీ సలహా నచ్చి, కొలువులో వున్నవాళ్ళ నొక్కొక్కరినీ ఆ తాయెత్తు తీసుకోమని అడిగాడు. కాని, దాని సంగతి తెలిసి వుండడంవల్ల, ఎవరూ దాన్ని తమ చేతికి కట్టుకోవడానికి సాహసించలేదు.

రాజు విసిగిపోయి, ఆ తాయెత్తును కట్టుకున్నవాళ్ళకు పెద్ద బహుమానం యిస్తానని, నగరంలో చాటింపు వేయించాడు. అప్పటికీ ఎవరూ ముందుకు రాకపోయేసరికి, రాజుకు తాయెత్తు, ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఎప్పుడూ రాచకార్యాల్లో మునిగి తేలుతూండే ఆయన నోట, తాయెత్తు మహిమవల్ల నిజం దాగడం లేదు.

చివరకు రాజు, మంత్రికి తన పరిస్థితి వివరించి, "మీరే, యీ తాయెత్తు వదిలే మార్గం ఆలోచించాలి," అని కోరాడు.

మంత్రి అందుకు రాజు నుంచి మూడు రోజులు గడువు తీసుకుని వెళ్ళిపోయాడు.

మూడవరోజున మంత్రి, ఒకణ్ణి వెంటబెట్టుకుని రాజు దగ్గిరకు వచ్చి, "ప్రభూ, తాయెత్తును కట్టుకోవడానికి, ఇతను అంగీకరించాడు. చేతికి కట్టండి!" అన్నాడు.

రాజు తాయెత్తును వాడి చేతికి కట్టి, ఏం మాట్లాడతాడో అని ఎదురు చూశాడు. కాని, వాడెంతకూ మాట్లాడకపోయేసరికి, ఆయన యిస్తానని చాటింపు వేయించిన బహుమతిని వాడికిస్తూ, "ఇంతవరకూ, తాయెత్తు కట్టుకోగానే నిజం మాట్లాడే వాళ్ళను చూశాను. మీరెవరో మహానుభావుల్లా వున్నారు! అందువల్లనే, యీ తాయెత్తు మహిమ, మిమ్మల్నేమీ చేయలేకపోయింది," అన్నాడు.

అందుకు మంత్రి చిన్నగా నవ్వి, "ప్రభూ, ఇతనేం మహానుభావుడు కాదు; మూగవాడు! ఇతనికి తప్ప, యీ తాయెత్తును కట్టుకునే ధైర్యం మరెవరికీ లేదు," అన్నాడు.





# గ్రామాధికారి రసహృదయం

విద్యాభూషణు డనే యువకుడు, గురుకులంలో విద్య ముగించుకుని, తన గ్రామానికి తిరిగి వచ్చాడు. తల్లిదండ్రులు వృద్ధులైన కారణంగా, అతడు వ్యవసాయప్పనులు చేబట్టి, వారి సేవలో కాలం గడపసాగాడు.

విద్యాభూషణుడు సహజంగానే కవి. గ్రామీణ వాతావరణంలో, ఏదో శక్తి ప్రోత్సహించినట్లనిపించి, తీరుబడి వున్నప్పుడల్లా, అతడు కావ్యరచనకు పూనుకునేవాడు. ఆ విధంగా, అతడు రెండు సంవత్సరాల్లో, పన్నెండు కావ్యాలు రాశాడు.

వ్యవసాయం చేస్తూ, వృద్ధులైన తమ అవసరాలు తీరుస్తూ, రెండు సంవత్సరాల్లో పన్నెండు కావ్యాలు రాయడం, సామాన్యమైన విశేషం కాదని, తల్లిదండ్రులు విద్యాభూషణుణ్ణి మెచ్చుకున్నారు.

అందుకు విద్యాభూషణుడు అంతగా తృప్తిపడక, ''రసహృదయులు మెచ్చుకున్నప్పుడే, కావ్యానికి సార్థకత. మన ఊళ్ళో, నా కావ్యాలు అసలు వినేవాళ్ళే లేరు. రోజురోజుకూ నాలో క్రమంగా కావ్యరచనచేయాలన్న కోర్కె అంతరిస్తున్నది.'' అన్నాడు.

విద్యాభూషణుడి తండ్రి, కొడుకు మీద జాలితో, ''ఏ కావ్యానికైనా రాజాదరణ ముఖ్యం. రాజధానికి వెళ్ళి, నువ్వు రాసిన కావ్యాలలో మంచిదాన్నొకటి ఎన్నుకుని, రాజుకు వినిపించిరా,'' అన్నాడు.

''నేను రాసినదేదైనా, నాకు బాగానే వుంటుంది. నా కావ్యాల్లో, అన్నిటికన్న మంచిదేదో ఎన్నిక చేయడానికి, యితరుల సాయం కావాలి. ఈ ఊళ్ళో, నాకు సాయపడగలవాళ్ళెవరూలేరు,'' అన్నాడు విద్యాభూషణుడు నిరుత్సాహంగా.

జొన్నలగడ్డ రామలక్ష్మి



"లేకేం! మన గ్రామాధికారి ఉన్నాడుగా," అన్నాడు విద్యాభూషణుడి తండ్రి సంతోషంగా.

ఆ గ్రామంలో, అంతో యింతో కవిత్వమంటే ఆసక్తిగలవాడు, గ్రామాధికారి ఒక్కడే. కాని, ఆయనకు నాసిరకం పదాలూ, పాటలేతప్ప, ఉత్తమకవిత్వం నచ్చదు. విద్యాభూషణుడికి, యీ విషయం తెలుసు.

అతడు, తండ్రితో, "రసహృదయం లేని వాడికి, కవిత్వం వినిపించడం, నావల్ల కాదు. ఒకవేళ వినిపించినా, అందువల్ల కావ్యం ఎన్నిక జరిగే పని కాదు గదా," అన్నాడు.

విద్యాభూషణుడి తండ్రికి కవిత్వం గురించి తెలియకపోయినా, ప్రపంచానుభవం బాగా వున్నది. ఆయన, కొడుకుతో, "నాయనా, తెలివైనవాడు సముద్రపు నీటితో పంటలు పండించగలడు. అప్రయోజకుల చేత, కావ్యాలు రాయించగలడు. నీ తెలివి నుపయోగించి, నీ కార్యం గ్రామాధికారి ద్వారా సాధించు," అంటూ, చెవిలో రహస్యంగా ఏదో హితబోధ చేశాడు.

ఆ ప్రకారం విద్యాభూషణుడు, గ్రామాధికారిని కలుసుకుని, ఒకటొక్కటిగా, తన కావ్యాలు వినిపించాడు. మొదటి కావ్యం వింటూనే, గ్రామాధికారి, విద్యాభూషణుణ్ణి ఎంతగానో మెచ్చుకుని, "ఇది అద్భుత కావ్యం! రాజుగారిని మెప్పించడానికి, ఇదొక్కటిచాలు," అన్నాడు.

అయినా, విద్యాభూషణుడు గ్రామాధికారిని వదలక, "రాజుగారిని మెప్పించడానికి, ఎలాంటి కావ్యం ఎన్నుకోవాలో తెలియడం లేదు. మిగిలినవాటిపై కూడా, రసహృదయులైన తమ అభిప్రాయం తెలుపండి," అని, కావ్యాలన్నీ వినిపించాడు.

ఈ మాటలకు, గ్రామాధికారి ఎంతో సంతోషించి, ఓపికతోనూ, శ్రద్ధగానూ మొత్తం కావ్యాలన్నీ విని, తన అభిప్రాయం చెప్పాడు. ఏ కావ్యమూ కూడా,

ఆయనకు మొదటి కావ్య మంతగా నచ్చ లేదు. మిగతావాటిల్లో ఒకటి, అత్యంత అధమంగా కూడా వున్నది.

కావ్యాలు వినిపించేందుకు, విద్యా భూషణుడికి సుమారు రెండు నెలలు పట్టింది. తర్వాత అతడు, తన కావ్యాలతో రాజధానికి బయల్దేరి వెళ్ళాడు. అదృష్టం కొద్దీ, అతడికి తేలికగానే రాజదర్శనం లభించింది.

విద్యాభూషణుడు చదివిన తొలి కావ్యాన్ని, రాజు అయిదు రోజులపాటు విని, ఎంతగానో మెచ్చుకుని, "నీలో మహాకవి కాగల లక్షణాలున్నవి. నీవు రాసిన కావ్యాలు మరేమైనా వున్నవా?" అని అడిగాడు.

"ప్రభూ, నేను చాలా కావ్యాలే రాశాను. నా కావ్యాలు, నాకు నచ్చడం సహజం. అయినా, రసహృదయులైన తమకు నచ్చ డానికి, అన్నిటిలోకీ ఉత్తమమైన కావ్యాన్ని ఎన్నుకోవాలి గదా! ఈ విష యంలో నాకు, మా గ్రామాధికారి సాయ పడ్డాడు. నా మిగిలిన కావ్యాలేవీ దీనికి సరిరావు...." అని విద్యాభూషణుడు ఏదో చెప్పబోతూండగా రాజు, అతణ్ణి వారించి, "నాకోసమింత గొప్ప కావ్యాన్ని ఎన్నిక చేసిన, మీ గ్రామాధికారిని కూడా సన్మా నించాలి!" అంటూ, వెంటనే గ్రామాధి కారికి కబురు పంపించాడు.

మరసటిరోజున గ్రామాధికారి రాగానే, రాజు అతడికి ఘనంగా సన్మానం చేసి,



విద్యాభూషణుడన్న మాటలు అతనికి చెప్పాడు.

ఇందుకు గ్రామాధికారి సంతోషించ డానికి బదులు, "ప్రభూ, విద్యాభూష ణుడు ముందుగా తమకు వినిపించిన కావ్యం, నాకు బొత్తిగా నచ్చనిది. నేను మెచ్చిన కావ్యం తమకు వినిపించి వుంటే—ఈ సన్మానం నాకు మరింతగా సంతోషం కలిగించేది," అన్నాడు.

రాజు, గ్రామాధికారిని అతిథి గృహానికి పంపివేసి, విద్యాభూషణుణ్ణి సంజాయిషీ అడుగుతూ, "గ్రామాధికారి ఎన్నిక చేసిన అద్భుత కావ్యం వుండగా, ఆయనకు నచ్చని కావ్యంతో నన్ను మెప్పించాలను కోవడం, నీ అత్యాశ! అవునా!" అన్నాడు.

అప్పుడు విద్యాభూషణుడు, "ప్రభూ, నేను కావ్యాన్నెన్నుకోవడంలో, గ్రామాధి కారి సాయం తీసుకున్నానన్నాను తప్ప, ఆయనకు నచ్చిన కావ్యాన్ని ఎన్నుకున్నా నని, తమకు చెప్పలేదు. మా గ్రామాధి కారి అభిరుచి ఏపాటిదో, నాకు తెలుసు. సాహిత్యపుటిలువవున్నదేదీ, ఆయనకు నచ్చదు. ఆయనకు నచ్చనివే, రసహృద యులకు నచ్చే కావ్యాలని, నాకు తెలుసు. నా కావ్యాలన్నీ ఆయన మెచ్చి వుంటే, నేను తమ దర్శనానికే వచ్చి వుండేవాణ్ణి కాను!" అన్నాడు.

తన కావ్యాల ఎన్నికకు విద్యాభూష ణుడు, గ్రామాధికారి నెలా ఉపయో గించుకున్నాడో తెలిసి, రాజుకు నవ్వాగ లేదు. ఆ సాయంత్రం ఆయన, గ్రామాధి కారిని అతిథి గృహం నుంచి పిలిపించి, "నా సన్మానం అందుకున్నాక, నువ్వు నోరు విప్పకుండా వుండవలసింది!" అని చెప్పి పంపేశాడు.

తర్వాత రాజు, విద్యాభూషణుడికి శాశ్వతంగా, తన ఆస్థానంలో వుండే ఏర్పాటు చేశాడు. విద్యాభూషణుడు, తల్లి దండ్రులు తనవద్ద వుండేందుకు రాజ ధానికి తీసుకువచ్చి, ఉత్తమ కావ్యాలు రచిస్తూ, తృప్తిగా కాలం వెళ్ళబుచ్చ సాగాడు.






## 17

[భల్లూకరాయుళ్ళు ఉగ్రదత్తుణ్ణి తమ నాయకుడైన కంధుడి దగ్గిరకు తీసుకుపోయారు. కంధుడు ఉగ్రదత్తుడితో ఏకపాదుణ్ణి చంపేందుకు రాక్షసుల సహాయం కావాలని చెపుతూనే, ఏకపాదుణ్ణి చంపటం అంత సులభంగా సాధ్యమయే పని కాదనీ; వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—మరుక్షణమే తప్పక మరణిస్తారనీ అన్నాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడైన ఏకపాదుడికి గల అపూర్వశక్తిని గురించి వినగానే ఉగ్రదత్తుడు నిలువెల్లా కంపించిపోయాడు. ఏకపాదుణ్ణి హతమార్చకుండా తనుగాని, తన స్నేహితులుగాని ఈ జ్వాలాద్వీపాన్ని వదలటం సాధ్యం కాదు. అంతేకాక సామంతరాజైన సుదర్శనుడి కుమార్తె చంద్రసేన కూడా ఆ దుర్మార్గుడి అధీనంలోనే వున్నది.

''ఆ దుర్మార్గుణ్ణి చంపటం అనేది చాలా గడ్డుసమస్య. ఒకసారి వాణ్ణి, నా భటులు ఒంటరిగా దొరకపుచ్చుకున్నారు. కాని, వాళ్ళు ఈటెలు ఎత్తి వాణ్ణి గుండెల్లో పొడవబోయ్యేలోపలే, వాడు తన కత్తితో ముఖం మీద గాటు వేసుకున్నాడు. ఆ నెత్తురు చూస్తూనే, నా భటులందరూ అక్కడే మరణించారు.'' అన్నాడు కంధుడు.




"అయితే, మనం వాడి ఎదట పడటం లోనే ప్రమాదం వున్నదన్నమాట! అయితే యిక వాణ్ణి చంపటం ఎలా?" అన్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

రుద్రుడు, ఏకపాదుడి కోట కేసి సాలోచనగా చూస్తూ, "ఒకసారి మనం ఆ కోటను చుట్టుముట్ట గలిగితే, తరవాత వాణ్ణి చంపటం ఎలాగో ఆలోచించవచ్చు. ఆ సమయానికి ఏదో ఒక ఉపాయం తోచక పోదు. ఉగ్రాక్షుడు పెద్ద జిత్తులమారి!" అన్నాడు.

"బహుశా నా పెంపుడు తండ్రి చచ్చినా ఫరవాలేదనుకుంటున్నట్టున్నది, ఈ రుద్రుడు!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు తన మనస్సులో. కాని, కంధుడు చెప్పినట్టు తను తన పెంపుడు తండ్రి సహాయం కోరక తప్పదు. బలవంతులూ, ప్రాణ భయం లేనివాళ్ళూ అయిన తన రాక్షస బంట్లు వచ్చి పాల్గొననిదే భయంకర పక్షుల్నీ, పులిరాయుళ్ళనూ ఓడించటం సాధ్యం కాదు.

ఉగ్రదత్తుడు యిలా ఆలోచిస్తూ వుండగా కంధుడు అతణ్ణి సమీపించి, "ఉగ్రదత్తా, నీ నిర్ణయం ఏమిటి? నీ పెంపుడు తండ్రి నుంచి సహాయం కోరుతూ వార్త పంపటమా, లేదా?" అని అడిగాడు.

"అక్కడికి ఎవరు వెళ్ళేటట్టు? నేనే వెళ్ళి రానా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

కంధుడు జవాబు యిచ్చే లోపలే, రుద్రుడు ముందుకు వచ్చి, "కపిలపురం వెళ్ళి, యిక్కడి సంగతి సందర్భాలు చెప్పి సహాయం నేను తీసుకువస్తాను. నన్ను పోనివ్వండి," అన్నాడు.

ఇందుకు కంధుడూ, ఉగ్రదత్తుడూ కూడా ఒప్పుకున్నారు. తరవాత కంధుడు తన అనుచరుల్లో ఒకణ్ణి పిలిచి, రుద్రుణ్ణి భయంకర పక్షి మీద ఎక్కించుకుని కపిలపుర రాజ్యంలోని అడవుల్లో దించాలని చెప్పాడు. దానికి వాడు అయిష్టంగా ముఖం పెట్టి, "అయ్యా, మీకు తెలుసు గదా?" ఈ ఉగ్రదత్తుణ్ణీ యితర్లనూ



పులిరాయుళ్ళు అపహరించి ఈ ద్వీపానికి తెచ్చినప్పటి నుంచీ, రాక్షసులూ, ప్రజలూ కూడా రేయింబవళ్ళు భయంకర పక్షుల కోసం కాపలా కాస్తున్నారు. మేము అ ప్రాంతాల దిగామో, వచ్చినపని చెప్పే ముందే మమ్మల్ని వాళ్ళు చంపేస్తారు !'' అన్నాడు.

ఉగ్రదత్తుడు ఓ క్షణ కాలం ఆలోచించి, ''అయితే, రుద్రుడు ఒక పని చేస్తే పోతుంది. అడవిలో దిగేముందు తనెవరో అక్కడి కాపలావాళ్ళు తెలుసుకునేందుకు వీలుగా, తన దుస్తుల్లో ఏదో ఒకదాన్ని పైనుంచి కిందకు పడవెయ్యటం బావుంటుంది. నేను నా పెంపుడు తండ్రికి రాసే లేఖ నొకదాన్ని కూడా, ఆ దుస్తుల్తోపాటు పడవేస్తే, సంగతి సందర్భాలు వాళ్ళు తెలుసుకుంటారు,'' అన్నాడు.

ఈ ఉపాయం అందరికీ నచ్చింది. ఉదయం కాగానే ప్రయాణం అయేందుకు చేయవలసిన ఏర్పాట్లు చేసుకోవలసిందిగా, తన అనుచరుడికీ, రుద్రుడికీ చెప్పి, కంధుడు ఉగ్రదత్తుణ్ణి వెంటబెట్టుకు వెళ్ళి, అతడికోసం ఏర్పాటు చేసిన శయనాగారాన్ని చూపించాడు.

* * *

తన కోటముందున్న ఆవరణలోని ఒక పెద్ద రాతి మీద తల రెండు చేతుల మధ్యా పెట్టుకుని విచారంగా కూచుని వున్న ఉగ్రాక్షుడి వద్దకు, అతడి బంట్లు యిద్దరు పరిగెత్తుకుంటూ వచ్చి, ''మహా నాయకా, ఏదో ప్రమాదం, అంతా అయోమయం, వాడికి మతిపోయున్నావుండాలి!'' అంటూ వగరుస్తూ నిలబడ్డారు.

''ఏమిటి ప్రమాదం? ఏమిటి అయోమయం? ఏమిటీ వాగుడు? మీకేనా మతి పోయింది!'' అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్ర చేసి తన బంట్లకేసి చూశాడు.

తమ నాయకుడి ముఖంకేసి చూస్తూనే, ఇద్దరు రాక్షస బంట్లూ తబ్బిబ్బు పడిపోయి, తడబడుతూ, ''ఎవడో ఒక జ్వాలా ద్వీపం వాడు పట్టపగలే మన అడవి మీద



ఎగురుతూ, కిందికి దిగాలని ప్రయత్నం చేస్తున్నాడు. మన కాపలావాళ్ళు వాడి మీదికి బాణాలూ, గదలూ విసిరారు. వాడు మూటలా కట్టిన ఏదో వస్తువును కింద పడవేసి, ఇంకా అక్కడే ఎగురుతున్నాడు.'' అన్నారు.

''ఆ వస్తువేది ? వెంట తెచ్చారా ?'' అన్నాడు ఉగ్రాక్షుడు కోపంగా.

''అది ఎక్కడో చెట్లలో పడింది. మన వాళ్ళు దానికోసం గాలిస్తున్నారు,'' అన్నారు రాక్షస బంట్లు.

''అయితే, ఈ లోపల మీకు మతులు పోయి పలవరిస్తూ, నా దగ్గిరకు పరిగెత్తుకొచ్చారన్న మాట! అక్కడికి పదండి!'' అంటూ హుంకరించి ఉగ్రాక్షుడు తన భటులవెంట బయలుదేరాడు.

ఉగ్రాక్షుడు అడవిలో కొంతదూరం వెళ్ళేసరికి ఒక ఎత్తయిన రాతిగుట్ట పక్కనే వున్న చెట్టుకింద కొందరు రాక్షసులూ, ప్రజలూ గుంపుగా కూడి రణగొణధ్వని చేస్తున్నారు. ఒక భయంకర పక్షి పైన చెట్ల మీద వలయాకారంగా ఎగురుతున్నది. ఉగ్రాక్షుడు తమ కేసి రావటం చూస్తూనే గుంపులో నుంచి ఒక రాక్షసుడూ, ఇద్దరు ప్రజలూ పరిగెత్తుకుంటూ అతడికి ఎదురువచ్చారు. రాక్షసుడి చేతిలో ఒక చిన్న రంగువస్త్రం, గుండ్రంగా కర్రకు చుట్టివున్న ఒక పత్రం వున్నాయి.

''మహానాయకా, ఆ భయంకర పక్షి మీద ముగ్గురు మనుషులున్నారు. అయితే వాళ్ళు పులిరాయుళ్ళు మాత్రం కాదు. వాళ్ళల్లో యిద్దరు ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించి వున్నారు. ఒకవేళ అవి మనను మోసగించేందుకు ఆ దుర్మార్గులు వేసిన మారువేషాలేమో! వాళ్ళు వీటిని మూటలా కట్టి, కింద పడవేశారు,'' అంటూ వస్త్రాన్నీ, కర్రకు చుట్టివున్న పత్రాన్నీ ఉగ్రాక్షుడికిచ్చాడు.

ఉగ్రాక్షుడు వాటిని అందుకుని పత్రాన్ని తెరిచి చూస్తూ, ''ఈ మానవ భాష చదవ

మనా నాకిస్తున్నావ్ ? బుద్ధిలేదా ? ఒరే, నరమానవా, ఈ గిలుకుడేంటో చదువు!'' అంటూ పక్కన వున్న మనిషికి యిచ్చాడు. వాడు అంతా చదివి అశ్చర్యపోతూ, ''మహారాక్షసా ! ఇది నీ పెంపుడు కొడుకు ఉగ్రదత్తుడు జ్వాలాద్వీపాన్నుంచి రాశాడు. ఆ భయంకర పక్షి మీద వున్న ముగ్గురిలో ఒకడు రుద్రుడట. తతిమ్మా యిద్దరూ భల్లూకరాయుళ్ళు, మనకు మిత్రులు,'' అన్నాడు.



''అహ్హా, నా ఉగ్రదత్తుడు బతికే వున్నాడా ? నాకు మొదటి నుంచి వాడు ఏదో ఒకనాడు తిరిగి, నా అరణ్యరాజ్యం వస్తాడని నమ్మకం వున్నది. అరె! వాడే రాక, ఈ రుద్రుణ్ణి ఎందుకు పంపినట్టు ? సరే, ఆ భయంకరపక్షి మీద వున్నవాళ్లకు కిందికి దిగమని సౌంజ్ఞలు చేయండి,'' అన్నాడు ఉగ్రాక్షుడు సంశయిస్తున్న వాడిలా.

కొందరు రాక్షసులూ, ప్రజలూ కలిసి చెట్ల మీది నుంచీ, గుట్టల మీది నుంచీ భయంకర పక్షి కేసి చేతులూ, పొడుగాటి చెట్ల కొమ్మలూ వూపుతూ దిగవలసిందిగా సౌంజ్ఞలు చేశారు. భయంకరపక్షి ఏటవాలుగా ఎగురుతూ వచ్చి ఉగ్రాక్షుడికి అల్లంత దూరంలో దిగింది. ఆ వెంటనే పక్షి మీది నుంచి రుద్రుడు చెంగున కిందికి దూకి, కేకలుపెడుతూ ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు.

రుద్రుణ్ణి చూస్తూనే ఉగ్రాక్షుడికి ఎంతో ఆనందం కలిగింది. అతడు రుద్రుణ్ణి రెండు చేతులతో పైకెత్తి, ఆప్యాయంగా అటూ యిటూ వూపి కిందికి దించుతూ, ''ఉగ్రదత్తుడు క్షేమంగా వున్నాడా ? వాడు నీతోపాటు ఎందుకు రాలేదు ? అరుద్రుడేమయ్యాడు ?'' అని అడిగాడు, ఆవేశంగా.

''ఉగ్రదత్తుడు క్షేమంగానే వున్నాడు. అరుద్రుడూ, సామంతరాజు సుదర్శనుడి కూతురు చంద్రసేనా పులిరాయుళ్ళవద్ద బందీలుగా వున్నారు. ఆ పులిరాయుళ్ళ




నాయకుడు ఏకపాదుడనే వాణ్ణి చంపితే తప్ప, వాళ్ళూ, ఉగ్రదత్తుడూ క్షేమంగా యిక్కడికి రాలేరు. అందుకు నిన్ను సహాయం రావలసిందిగా ఉగ్రదత్తుడు కోరాడు,'' అన్నాడు రుద్రుడు.

''నా కొడుకు నన్ను సహాయం రావలసిందని కోరటమా? ఏమిటీ మాటలు! వాడు నా నుంచి పారిపోవాలని చూసినా, పధ్నాలుగు లోకాలూ గాలించి పట్టుకుని కాళ్ళూ చేతులూ కట్టి, కోటలో పడవేస్తాను. నా తరవాత ఈ అరణ్యరాజ్యానికి నాయకు లెవరు?'' అంటూ పట్టరాని ఆగ్రహంతో అడవి మార్మోగేలా ఉగ్రాక్షుడు హుంకరించాడు.

ఉగ్రాక్షుడు కొంత శాంతించిన తరవాత రుద్రుడు, జ్వాలాద్వీపంలో వున్న రెండు శత్రుపక్షాల సంగతీ, భల్లూకరాయుళ్ళ నాయకుడైన కంధుడు తనకు చేసిన సహాయం సంగతీ చెప్పాడు.

''పడవల్లో బయలుదేరి రావాలి. మీరు జ్వాలాద్వీపం చేరేందుకు రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ పడుతుంది. దారి చూపేందుకు ఒక భల్లూకరాయుడు నా వెంట వచ్చాడు,'' అంటూ అతణ్ణి ఉగ్రాక్షుడికి పరిచయం చేశాడు. తరవాత రుద్రుడు దారి చూపవచ్చిన భల్లూకరాయుణ్ణి ఉగ్రాక్షుడి దగ్గిర వదిలి, తాను మరుక్షణమే తిరిగి జ్వాలాద్వీపం వెళ్ళిపోయాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో మెరికలవంటి వారిని అయిదు వందలమందిని ఏరి, వాళ్ళతో జ్వాలాద్వీపం వెళ్ళేందుకు ప్రయాణం కట్టాడు. వాళ్ళు మహారణ్యాల్లో పడి, కొండలూ, నదులూ దాటుతూ, వారం రోజుల తరవాత సముద్రతీరం చేరారు.

రాక్షసుల్లో చాలామంది సముద్రాన్ని యిదే మొదటిసారిగా చూడటం. కంటికానినంతవరకూ వున్న ఆ మహాప్రవాహాన్ని చూస్తూనే వాళ్ళు చెప్పలేనంతగా నివ్వెరపోయారు. ''ఇంత మహాసముద్రం మధ్య

నేల ఎలా వుంటుంది? ఇందులో ఏదో మోసం వున్నది. ఎలాగయినా మనకు నీటి గండం తప్పదు." అని వాళ్ళు గుసగుసలు ప్రారంభించారు.



ఈ సంగతి తన చెవిని పడగానే ఉగ్రాక్షుడు రౌద్రరూపం దాల్చి, "అడవి చెట్లు నరికి, వాటి బొదులతో ఒక్కొక్కటి యాభైమందిని మోయగలిగేట్టుగా పది పడవలు కట్టండి. వాటిని జాగ్రత్తగా కట్టుకున్నారా, మీరు సముద్రం దాటి జ్వాలాద్వీపం చేరుతారు. లేదా మీరు భయపడుతున్నట్టు మీకు నీటిగండం తప్పదు!" అన్నాడు.

ఉగ్రాక్షుడి హెచ్చరిక రాక్షసుల్లో ఒక చెంప భయాన్నీ, మరో చెంప ఆత్మవిశ్వాసాన్నీ, తెగువనూ కలిగించింది. వాళ్ళు మహావృక్షాలను వేళ్ళకంటా ఊడబెరికి, ఊడలతో ఒక మానుకూ ఇంకొక మానుకూ బంధాలు బిగించి పెద్దపెద్ద తెప్పపడవలు తయారు చేశారు.

అన్నీ సిద్ధమై ఒకనాటి సూర్యోదయం వేళ ఉగ్రాక్షుడు సముద్రం మీద బయలుదేర పోతూండగా, చిత్రసేనుడి దగ్గిర నుంచి ఒక దూత అక్కడికి వచ్చాడు. అతడి ద్వారా, జ్వాలాద్వీప పరిస్థితులు చిత్రసేనుడికి తెలుసునన్న విషయం ఉగ్రాక్షుడు తెలుసుకున్నాడు. తన దూత ద్వారా చిత్రసేనుడు, ఉగ్రాక్షుడికి. కొంత సైనిక సహాయం చేస్తానని కబురు పంపాడు.

"తన కుమారుణ్ణి పులిరాయుళ్ళు ఎత్తుకుపోయారని తెలిసి, మహారాజూ, మహారాణీ దుఃఖసాగరంలో మునిగిపోయారు. ఈ వార్తతోపాటు సామంతుడి కుమార్తె చంద్రసేన కూడా అపహరించబడిందని తెలిసి మరింత బాధపడ్డారు. ఆ సామంతరాజు సుదర్శనుడు లోగడ ద్రోహి నాగవర్మతో జరిగిన యుద్ధాల్లో మహారాజుకు ఎంతగానో సహాయపడ్డాడు. ఆయన మహారాణికి. బంధువు కూడా. రాకుమారి చంద్రసేనతో యువరాజుకు

వివాహం జరపటం బావుంటుందని కూడా వారు భావిస్తున్నారు,'' అని చెప్పాడు దూత.

దూత మాటలు వింటూనే ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించిపోయాడు. రాతి గదను దూతపైకి ఎత్తబోయినవాడల్లా తమాయించుకుని, ''వాడు యువరాజు కాదు, ఉగ్రదత్తుడు, నా కుమారుడు! నా కుమారుడి కోసం దుఃఖించే హక్కు మీ రాజుకూ, రాణికీ లేదన్నానని చెప్పు. ఈ సామంతుడెవడు? సుదర్శనుడెవడు? వాడి పేరు కూడా ఎన్నడూ వినలేదే! వాడి కుమార్తె చంద్రసేన ఉగ్రదత్తుడికి తగునో తగదో తేల్చవలసినవాణ్ణి, నేను! తెలిసిందా? ఇక వెళ్ళు!'' అంటూ హుంకరించాడు.

ఉగ్రాక్షుడితో యింకేమి చెప్పినా తన ప్రాణానికే ముప్పు రావొచ్చని భావించిన దూత తిరిగి చూడకుండా అక్కడి నుంచి పారిపోయాడు. తరవాత ఉగ్రాక్షుడి ఆజ్ఞ కాగానే రాక్షసులు పడవలను సముద్రం లోపలికి కొంతదూరం లాగి, పశువుల చర్మాలతో కుట్టిన తెరచాపలను గాలి వాలుకు ఎత్తారు. అన్నిటికన్నా ముందున్న పడవలో దారి చూపేందుకు వచ్చిన భల్లూకరాయుడు ఎక్కాడు.

రాక్షసు లెక్కిన పడవలు ఏ ప్రమాదం లేకుండానే ఆ పగలూ, రాత్రీ సముద్రంలో ఎక్కడా ఆగకుండా తూర్పు దిక్కుగా ప్రయాణించినై. కాని, మర్నాటి సూర్యోదయం వేళకు వాళ్ళకు దూరంగా సముద్రంలో ఆకాశం ఎత్తు భయంకరమైన మంటలు కనిపించినై. ''జ్వాలాద్వీపం! జ్వాలాద్వీపం!'' అంటూ కొంత భయంగా, కొంత ఉత్సాహంగా రాక్షసులు గట్టిగా కేకలు పెట్టారు. ఆ తరవాత కొద్దిసేపటి కల్లా, ద్వీపం వైపు నుంచి తమకేసి వస్తున్న నల్లని నలుసంత చిన్న ఆకారం ఒకటి వాళ్ళకు కనిపించింది. అది చూస్తూండగానే క్రమక్రమంగా పెరిగి పెద్దదై— భయంకరపక్షిగా పడవల మీద ప్రత్యక్షమైంది. —(ముగింపు వచ్చే సంచికలో)






# గుణశేఖరుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ప్రజలకష్టసుఖాలుపర్యవేక్షిస్తూ, ధర్మంగా రాజ్యపాలన చెయ్యవలసిన నువ్వు, ఈ అర్ధరాత్రివేళ శ్మశానంలో కాలం వృథా పుచ్చుతున్నావు. ఇందుకు కారణం, ఎవరో నీచమైన తలంపుతో, నిన్ని కార్యానికి పురిగొల్పారన్న అనుమానం కలుగుతున్నది. నీచులకూ, బుద్ధిహీనులకూ సహాయం చెయ్యడం, ఎంత ప్రమాదకరమైనదో, నీకు తెలియవలసిన అవసరం వున్నది. నీకు కనువిప్పు కలిగేందుకు, గుణశేఖరుడనే అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు :

*బేతాళ కథలు*



మంచి రాజుగా తీర్చిదిద్దే బాధ్యత, నీకు అప్పగిస్తున్నాను,'' అని చెబుతూ వచ్చాడు.

గుణశేఖరుడు వీలయినప్పుడల్లా, శౌర్యపాలుడికి ధైర్యమూ, రాజనీతి గురించి చెప్పేవాడు. అయితే, అవన్నీ బురదలో పోసిన పన్నీరులా వ్యర్థమైపోతూండేవి.

ఇలా వుండగా, గాంధారదేశపు రాజు నుంచి, రాజ్యపాలుడికి, ఒక వర్తమానం వచ్చింది. ఆ దేశపు రాజైన సింహబలుడి కుమార్తె కళ్యాణలతిక వివాహం గురించిన వర్తమానం అది.

ఆమె స్వయంవరం ఒక కొత్త పద్ధతిలో ఏర్పాటు చేయబడుతున్నది. అందుకు, మూడు పరీక్ష లుంటాయి. ఉత్తమ క్షత్రియులెవరైనాసరే, ఆ పరీక్షలలో పాల్గొనవచ్చు. ఇందుకు గురించిన వివరాలు, గాంధారదేశపు రాజధాని అయిన గార్గేయపురంలో తెలుసుకోవచ్చు!

ఈ వర్తమానంతోపాటు, కళ్యాణలతిక చిత్రపటం కూడా పంపబడింది. రాజ్యపాలుడు అంతా విని మౌనంగా వూరుకున్నాడు. శౌర్యపాలుడు, కళ్యాణలతిక చిత్రపటం చూస్తూనే ముగ్ధుడైపోయాడు.

అతడు, గుణశేఖరుణ్ణి కలుసుకుని, సంగతి వివరంగా చెప్పి, ''నేనా కళ్యాణలతికను ఎలాగైనా వివాహమాడదలిచాను.

అవంతీదేశానికి రాజైన, రాజ్యపాలుడి కుమారుని పేరు శౌర్యపాలుడు. అతడి పేరులోని శౌర్యం, నేతిబీరకాయలోని నెయ్యిలాంటిది. చిన్నప్పటి నుంచీ శౌర్యపాలుడు బుద్ధిహీనుడుగా, మూర్ఖుడుగా పెరిగి పెద్దవాడయ్యాడు.

శౌర్యపాలుడికి, గుణశేఖరుడనే మంత్రి కుమారుడితో మైత్రి వుండేది. అతడు మంచి గుణవంతుడేగాక, మేధావి.

శౌర్యపాలుడి బుద్ధిహీనత్వం ఎరిగిన రాజ్యపాలుడు, గుణశేఖరుడితో, ''నాయనా, మీరిద్దరూ సహాధ్యాయులు. శౌర్యపాలుడు భావిమహారాజైతే, నువ్వు అతడి కాబోయే మంత్రివి! శౌర్యపాలుణ్ణి

మనం బయలుదేరి గార్గేయపురం వెళదాం,'' అన్నాడు.

అందుకు, గుణశేఖరుడు, ''ఆ పరీక్షలు ఎటువంటివో మనకు తెలియదు. అనాలోచితంగా వెళితే భంగపాటు తప్పదు,'' అన్నాడు.

''అందుకే గదా, నిన్ను వెంట రమ్మంటున్నది! ఆ పరీక్షల వివరాలు తెలుసుకున్న తర్వాత, అవసరం అయితే నువ్వు, నాకు సహాయం చేద్దువుగాని, పద!'' అంటూ తొందర పెట్టాడు శౌర్యపాలుడు.



''రాజుగారి అనుమతి తీసుకోవద్దా ?'' అని అడిగాడు గుణశేఖరుడు.

''నాన్నగారికి తెలిస్తే ఒప్పుకోరు,'' అన్నాడు శౌర్యపాలుడు.

ఇక చేసేదిలేక గుణశేఖరుడు, శౌర్యపాలుడితో కలిసి గార్గేయపురానికి బయలుదేరాడు. అక్కడికి చేరాక, పరీక్షల వివరాలు తెలుసుకున్నాడు.

ఒకానొక భవనంలో, ఆ పరీక్షలు జరుగుతాయి. అక్కడ వరసగా మూడు గదుల్లో, మూడు పరీక్షలు ఏర్పాటు చెయ్యబడినై.

ఈ మూడు పరీక్షల్లో మొదటిది; పాముల మధ్య నుంచి నడవడం. మొదటి గదిలో ఖాళీ లేకుండా పాములు వుంటవి. తలలూపుతూ బుసలుకొట్టేవాటి మధ్య నుంచి నడుస్తూ, రెండవ గదిలోకి వెళ్లాలి. రెండవ గదిలోకి వెళ్ళగానే, ప్రవేశ ద్వారం దగ్గిర నిలబడిన చెలికత్తె, ''క్షమించాలి! ఆ విషసర్పాలు, మిమ్మల్నేం చేశాయి ?'' అని అడుగుతుంది.

ఆ ప్రశ్నకు సమాధానం విని, రెండవ గదిలోకి వెళ్ళనిస్తుంది.

ఆ గదిలో ఇద్దరు బ్రాహ్మణులు కూర్చుని వుంటారు. అయితే, ఆ ఇద్దరిలో, ఒక్కడే బ్రాహ్మణుడు; రెండవవాడు అన్యకులస్థుడు! ఆ ఇద్దరిలో, ఎవరు ఎవరో చెప్పాలి. అది సరిగా చెప్పిన తర్వాత, మూడవ గదిలోనికి ప్రవేశం దొరుకుతుంది.



అ వివరాలన్నీ విన్న తర్వాత, గుణ శేఖరుడు సాలోచనగా, "శౌర్యపాలా, మొదటి గదిలో అడుగడుక్కీ పాములున్న వంటే, అవి బొమ్మపాములై వుండాలి. మధ్య, మధ్య ఏ ఒకటి, రెండో నిజమైన సర్పాలున్నప్పటికీ, అవి కోరలు తీసినవై వుంటాయి," అంటూ, మూడు పరీక్షలకూ ఏమేం చేయాలో—చిత్ర వ్యాఖ్యానంతో సహా బాగా నూరిపోసి పంపించాడు.

శౌర్యపాలుడు నిలువెల్లా వణికి పోతూనే ఎలాగో పాములున్న గదిలో ప్రవేశించి, దాన్ని దాటి, రెండవ గది దగ్గిరకు పోయాడు.

అక్కడ వున్న రాకుమారి చెలికత్తె, "క్షమించాలి! ఆ విషసర్పాలు మీకేమైనా హాని కలిగించాయా?" అని అడిగింది.

శౌర్యపాలుడు బింకంగా, "ఆ సర్పాకృతులు, నన్నేంచేయగలవు!" అన్నాడు.

చెలికత్తె వంగి అతడికి నమస్కరించి, రెండవ గదికి దారి చూపింది. అక్కడ ఇద్దరు బ్రాహ్మణులు దర్భాసనాల మీద కూర్చుని, జపమాలలు తిప్పుతున్నారు.

శౌర్యపాలుడు, ఆ యిద్దరికేసీ నిశితంగా చూస్తూ, "పరీక్షకోసమైతేనేం, రాజకుమార్తె యిచ్చే డబ్బుకు ఆశపడి అయితేనేం—అన్యకులస్థుడితో సమానంగా కూర్చున్న, యీ బ్రాహ్మణుడు,

మూడవ గదిలోని, ఒక గోడకు చిత్ర పటం ఒకటి వేలాడతీయబడి వుంటుంది. అది కళ్యాణలతిక చిత్రించినదే! ఆ చిత్రంలో సగం తెలుపు, సగం నలుపుగా చిత్రించిన గుర్రాన్ని అధిరోహించిన సుందరపురుషు డొకడు, దాన్ని లాఘవంగా, ఒక తిరుగుతున్న చక్రం మీదికి పోనిస్తూంటాడు.

అక్కడికి వచ్చినవాళ్ళు, ఆ చిత్రం చూసి చేసే వ్యాఖ్యానాన్ని, అక్కడ నిలబడిన భటుడు వింటాడు. ఆ వ్యాఖ్యానం సరి అయినదయితే, భటుడు అతణ్ణి, తిన్నగా కళ్యాణలతిక దగ్గిరకు తీసుకు పోతాడు.

నా దేశస్థుడైతే, యిక్కడే తల నరికేసే వాణ్ణి!'' అన్నాడు.

ఆ వెంటనే, ఆ యిద్దరిలో, ఒకడి ముఖంలో ఆవేశం కనిపించింది. శౌర్యపాలుడు, అతడిని, అక్కడ వున్న భటుడికి చూపుతూ, ''ఇతడే నిజమైన బ్రాహ్మణుడు!'' అన్నాడు.

భటుడు నమస్కరించి, శౌర్యపాలుడికి మూడవ గదిలోకి దారి చూపించాడు.

శౌర్యపాలుడు మూడవ గదిలోకి వెళ్ళి, అక్కడి చిత్రపటాన్ని చూసి కాసేపు ఆలోచించినట్టు నటించి, ''ఈ చక్రం, కాలచక్రం! సుఖమూ, దుఃఖమూ సమపాళ్ళుగా వుండే జీవితమనే అశ్వాన్ని అధిరోహించి, ఆ జీవితాశ్వం కళ్ళెం జారిపోకుండా తన అదుపులో వుంచుకుని, కాలాన్ని కీర్తితో అధిగమించగల ధీరోదాత్తుణ్ణే, తాను పెళ్ళాడ దలచుకున్నానని—మీ రాజకుమార్తె, యీ చిత్రం ద్వారా చెప్పదలచుకున్నది,'' అన్నాడు.

అక్కడ వున్న భటుడు, శౌర్యపాలుడికి నమస్కరించి, ''తమరు, యీ పక్కన వున్న గదిలోకి వెళ్ళండి,'' అన్నాడు.

శౌర్యపాలుడు అనందంతో అటు నడిచాడు. అయితే, శౌర్యపాలుడు, కళ్యాణలతికను కలుసుకునేలోగా, అతడి విజయవార్త అమెకు చేరవేయబడింది.



పాములు వున్న గదిలో ప్రవేశించే సమయంలో, శౌర్యపాలుడి వణుకూ, భయం గమనించిన వేగులు, ఆ సంగతి కళ్యాణలతికకు చెప్పడం జరిగింది. ఆ వేగులే యిప్పుడు వచ్చి, అతడి విజయవార్త వినిపించగానే, అమె ఆశ్చర్యపోయింది. సునిశితమైన ఆమె బుద్ధికి, శౌర్యపాలుడి విజయం వెనక, ఎవరిదో వ్యూహం వుండవచ్చన్న అనుమానం కలిగింది.

శౌర్యపాలుడు విజయగర్వంతో, కళ్యాణలతిక దగ్గిరకు వచ్చాడు.

కళ్యాణలతిక, అతడితో, ''మీ విజయానికి అభినందనలు తెలుపుతున్నాను. ఆ మూడు పరీక్షలలో నెగ్గినవారికి,



యింకొక పరీక్ష వున్నది,'' అన్నది, చిన్నగా నవ్వుతూ.

ఆ మాట విని శౌర్యపాలుడు మండిపడుతూ, "మళ్ళీ మరొక పరీక్షా?" అన్నాడు.

కళ్యాణలతిక వినయంగా, ''అలా కోపగించకండి. పై మూడు పరీక్షలూ, మీ స్వంతబుద్ధితో గెలుచుకున్నవే అని రుజువు కానిదే, మా గురువర్యులు మన వివాహానికి ఒప్పుకోరు,'' అన్నది.

''ఎవడా గురువర్యుడు? ఎలా రుజువు చేస్తాడు?'' అంటూ పళ్ళు కొరికాడు, శౌర్యపాలుడు.

కళ్యాణలతిక, అతడి దురుసుమాటలకు నొచ్చుకుని, ''తన మంత్రశక్తితో, మా రాజగురువు, మీ నిజాయితీని పరీక్షిస్తారు. ఈ పరీక్షలు, మీ సొంత బుద్ధితో గెలిచినవి కాకపోతే, మీరు కురూపిగా మారటమేగాక, రాజదండనకు కూడా గురికావలసి వస్తుంది,'' అన్నది.

వెంటనే శౌర్యపాలుడు, ''ఇది నన్ను అవమానించడం! మా దేశం వెళ్ళి, సైన్యంతో వచ్చి, నీ తండ్రిని మట్టి కరిపించి, నిన్ను పెళ్లాడకపోతే చూడు!'' అన్నాడు.

కళ్యాణలతిక చిరునవ్వు నవ్వి, ''ఓయీ, శౌర్యపాలా! సాటి రాజకుమార్తెతో యింత హీనంగా మాట్లాడుతున్న నిన్ను, యీ పరీక్షలలో గెలిపించినది, మంత్రికుమారుడు గుణశేఖరుడా?'' అని అడిగింది.

శౌర్యపాలుడు నిర్ఘాంతపోయి, నోట మాట రాక నిలబడిపోయాడు.

''ఇక మీరు వెళ్ళి, మీ మిత్రుడైన మంత్రి కుమారుణ్ణి పంపండి,'' అన్నది కళ్యాణలతిక.

శౌర్యపాలుడు తల వంచుకుని బయలుదేరి, గుణశేఖరుణ్ణి కలుసుకుని జరిగినదంతా చెప్పాడు.

గుణశేఖరుడు ప్రమాదాన్ని శంకించి, శౌర్యపాలుడితో, ''యువరాజా, మీరు మన రాజ్యానికి బయలుదేరండి. నేను వెనకగా

వచ్చి కలుసుకుంటాను," అని చెప్పి, కళ్యాణలతిక వున్న చోటుకు వచ్చాడు.

అతడి మేధస్సుకు వన్నె తెచ్చేదిగా వున్న గుణశేఖరుడి రూపాన్ని చూస్తూనే, కళ్యాణలతిక తత్తరపడింది.

తర్వాత ఆమె, గుణశేఖరుణ్ణి, అక్కడ వున్న ఒక ఆసనంలో కూర్చోవలసిందిగా కోరి, "నేను పెట్టిన మూడు పరీక్షల లోనూ, ప్రత్యక్షంగా పాల్గొనకుండానే గెలిచారు. విజయలక్ష్మితోపాటు, నన్ను కూడా స్వీకరించవలసిందిగా ప్రార్థిస్తు న్నాను," అన్నది.



గుణశేఖరుడు నవ్వి, "పరీక్షల్లో ప్రత్యక్షంగా పాల్గొన్నవాడే, అభ్యర్థి అవుతాడు. సమాధానాలు తెలిసిన ప్రతివాడూ, విజేత కాగల అర్హతగలవాడవుతాడేగానీ, విజేత కాడు!" అన్నాడు.

ఆ సమాధానం విని, కళ్యాణలతిక చిత్రంగా నవ్వి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది. ఆమె నవ్వు గురించి ఆలోచిస్తూ, గుణశేఖరుడు బయలుదేరి, శౌర్యపాలుణ్ణి కలుసుకున్నాడు.

ఇద్దరూ రాచనగరు చేరాక, రాజ్యపాలుడు, ఆ ఇద్దరు చెప్పినదీ విని, కొంతసేపు మౌనంగా వూరుకుని, గుణశేఖరుడితో "రేపు మనిద్దరం అరణ్యానికి వేటకు పోదాం, సిద్ధంగా వుండు," అన్నాడు.

ఆ మర్నాటి ఉదయం ఇద్దరూ అరణ్యానికి వెళ్లారు. ఒకచోట రాజ్యపాలుడు, హఠాత్తుగా గుణశేఖరుడి పైకి కత్తి ఎత్తాడు.

గుణశేఖరుడు, ముందే ఊహించినవాడిలా, చప్పున రాజు చెయ్యి పట్టుకుని, "మీ కుమారుడి బుద్ధిహీనత్వం బయట పడడానికి కారణం, గాంధారరాకుమారి సునిశితబుద్ధే కాని, నా స్వార్థం కాదు!" అంటూ, రాజును గుర్రం మీది నుంచి పడదోసి, తన గుర్రాన్ని దౌడుతీయించాడు.

అతడు గాంధారదేశానికి వెళ్లి, కళ్యాణలతికను కలుసుకుని, ఆమెను వివాహమాడేందుకు సిద్ధంగా వున్నట్టు చెప్పాడు.

కళ్యాణలతికా, గుణశేఖరుల వివాహం వైభవంగా జరిగిపోయింది. వారం రోజులు గడిచాక, గుణశేఖరుడు మామగారి సైన్యంతో, అవంతీదేశం మీదికి దాడిపోయి, రాజ్యపాలుణ్ణి చిత్తుగా ఓడించి, సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఈ కథలో బుద్ధిహీనులెవరు? అత్యంత భక్తి గౌరవాలతో, రాజకుటుంబానికి సేవ చేస్తున్న గుణశేఖరుడు, చివరకు రాజు మీదే ఎదురు తిరిగి, కళ్యాణలతికను వివాహమాడడం అక్రమం కాదా? గుణశేఖరుడు తనను పెళ్ళాడ నిరాకరించినప్పుడు, కళ్యాణలతిక చిత్రంగా ఎందుకు నవ్వింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజ్యపాల, శౌర్యపాలులిద్దరూ, ఒకరినిమించి ఒకరు బుద్ధిహీనులు. కొడుకు బుద్ధిహీనత బైట పడినందుకు అవమానమూ, కొడుకును కాదని కళ్యాణలతిక, గుణశేఖరుణ్ణి వరించినందుకు ఈర్ష్య, రాజ్యపాలుడిలోని బుద్ధిహీనతకు తిరుగులేని సాక్ష్యం. మేధావంతుడూ, భావిమంత్రీ అయిన గుణశేఖరుణ్ణి, ఏ నేరం చేయకుండానే, రాజ్యపాలుడు హత్య చేయాలని చూశాడు. ఈ కారణంవల్లనే, గుణశేఖరుడిలోని స్వామిభక్తి మరుగైపోయింది. అతడు సామాన్య పౌరుడుగా, తనను వరించిన కళ్యాణలతికను వివాహమాడి, తన దేశాన్ని నీచుల నుంచి కాపాడడానికి పూనుకున్నాడు. ఇక, గుణశేఖరుడు తనను నిరాకరించినప్పుడు, శౌర్యపాలుడి తండ్రి కూడా బుద్ధిహీనుడైతే, ఏమవుతుందో ఊహించి, కళ్యాణలతిక చిత్రంగా నవ్వింది. ఆ నవ్వులోని అంతరార్థం, గుణశేఖరుడికి మార్గదర్శకమయింది!" అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



పిల్లలకు చందమామ నిర్వహిస్తూన్న పోటీలో సరదాగా పాల్గొనండి!

# మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

ఉత్తేజకరమైన మూడు భాగాలలో

**పోటీ : 1**
గొప్ప భారతీయ రాజులు



**పోటీ : 2**
గొప్ప భారతీయ రాణులు



**పోటీ : 3**
గొప్ప భారతీయ జంటలు



రూ. **1,30,000** ల విలువకు మించిన బహుమతులు గెలుచుకోండి!

11 భాషలలో ప్రతి పోటీకీ గొప్ప బహుమతులు:

| | | |
|---|---|---|
| 11 ప్రథమ బహుమతులు | : | 2,000 రూపాయలు స్కాలర్‌షిప్ |
| 11 ద్వితీయ బహుమతులు | : | 1,000 రూపాయలు స్కాలర్‌షిప్ |
| 11 తృతీయ బహుమతులు | : | 500 రూపాయలు స్కాలర్‌షిప్ |

ఇవిగాక, బంపర్ ప్రైజులు

| | | |
|---|---|---|
| ప్రథమ బంపర్ | : | 10,000 రూపాయలు స్కాలర్‌షిప్ • |
| ద్వితీయ బంపర్ | : | 5,000 రూపాయలు స్కాలర్‌షిప్ • |
| తృతీయ బంపర్ | : | 2,500 రూపాయలు స్కాలర్‌షిప్ • |

• ఐదేళ్ళవరకు ఐదు సమాన వాయిదాలలో

220 కన్సొలేషన్ బహుమతులు: ఒక యేడాదిపాటు చందమామకు ఉచిత చందా

## పాల్గొనడం ఎలా?

మీ చరిత్ర పుస్తకాలనూ, పాత చందమామ కాపీలనూ దగ్గరుంచుకుని, కుటుంబ సభ్యులందరితోపాటు కూర్చుని ప్రారంభించండి!

భారతీయ చరిత్రకూ, పురాణాలకూ సంబంధించిన సుప్రసిద్ధరాజుల చిత్రపటాలు కొన్ని ప్రక్కన ఇవ్వబడ్డవి. చిత్రపటాలను జాగ్రత్తగా పరిశీలించి చూసి, అవి ఎవరివో గుర్తించి, దానికి సరిపోయే సంఖ్యను బాక్స్‌లో రాయండి. తరవాత అక్కడ వున్న ఆరు చిత్రపటాలలో ఒకదానిని ఎన్నుకుని, దానిని పూర్తిచేసి, పక్క పేజీలో వున్న "నేను...... రాజుగా వుండడానికి ఇష్టపడేవాణ్ణి. ఎందుకంటే........" అన్న వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

ఉత్సాహకరమైన చక్కని సమాధానం రాయండి. ఉత్తమ సమాధానాలు బహుమతులు గెలుచుకుంటాయన్న విషయం గుర్తుంచుకోండి!

మీ పేరూ, వయసూ, చిరునామా రాసి, పేజీని కత్తిరించి ఎంట్రీఫారాన్ని మాకు పోస్టు ద్వారా పంపండి. ఈ పోటీ ఫలితాలు వచ్చేలోగానే, పోటీ: 2, పోటీ: 3ల కోసం రానున్న చందమామ సంచికలలో చూడండి.

## పోటీ నిబంధనలు:

1. 16 సంవత్సరాల వయసుకు లోబడిన పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు. ఒకరు ఎన్ని ఎంట్రీలనైనా పంపవచ్చు. అయితే, అవి చందమామలో అచ్చయిన ఎంట్రీఫారాలలో మాత్రమే పంపాలి.

2. ఒకరు ఒక్క పోటీలోగాని, లేదా మొత్తం మూడు పోటీలలోనూ (గొప్ప భారతీయ రాజులు, గొప్ప భారతీయ రాణులు, గొప్ప భారతీయ జంటలు) పాల్గొని బహుమతులు గెలుపొందవచ్చు. ఇవిగాక, బంపర్ ప్రైజులకు కూడా ప్రయత్నించవచ్చు.

3. ఎంట్రీఫారాలను, స్పష్టమైన దస్తూరీలో, చందమామ ప్రచురింపబడుతూన్న పదకొండు భాషలలో ఏ భాషలోనైనా సరి పూర్తిచేసి పంపవచ్చు.

4. పోటీ: 1 ఎంట్రీఫారాలు అక్టోబర్ 31, 1987 లోగా మాకు చేరాలి.

5. ఎంట్రీలు ఆలస్యంగా అందినా, పోయినా, పాడయినా నిర్వాహకులు బాధ్యత వహించరు.

6. ఎంట్రీలను మామూలు పోస్టు ద్వారా మాత్రమే పంపాలి.

7. చందమామ పబ్లికేషన్స్ ఉద్యోగులూ, హిందూస్థాన్ థాంప్సన్ అసోసియేట్స్ ఉద్యోగులూ, వారి కుటుంబ సభ్యులూ తప్ప తక్కిన భారతీయ పౌరులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.

8. ఎంట్రీలను పరిశీలించి, ఎన్నికచేయడంలో న్యాయనిర్ణేతల మండలిదే తుదినిర్ణయం. ఈ విషయంగా ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.

9. విజేతలకు వ్యక్తిగతంగా పోస్టులో తెలియచేయబడు తుంది. వారి పేర్లు చందమామలో ప్రకటించబడతాయి.

**ముఖ్య గమనిక: బంపర్ ప్రైజ్ సెక్షన్**

మీ ఎంట్రీఫారాలు పోస్టుచేసే ముందు, వాటిలో 'చందమామ పోటీ: 1' అని వున్న లేబిల్‌ను కత్తిరించి మీదగ్గరే భద్రపరుచుకోండి. 2, 3 పోటీలకు కూడా అలాగే చేయండి. ఈ మూడు లేబిల్స్‌నూ కలిపి, బంపర్ సెక్షన్ ఎంట్రీఫారం (డిసెంబర్ చందమామ సంచికలో వస్తుంది) మీద అతికించాలి. 3 లేబిల్స్ అతికించబడిన ఎంట్రీ ఫారాలు మాత్రమే బంపర్ ప్రైజు పరిశీలనకు అంగీకరించబడతాయి.

ఈ చందమామ కాపీని భద్రపరచండి. బంపర్ సెక్షన్ ప్రశ్నలు సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ సంచికలపై ఆధారపడి ఉంటాయి.

# పోటీ : 1

## (ఎంట్రీఫారం)





ఉదాహరణలో చూపిన విధంగా, ఈ అరుగురు రాజుల చిత్ర పటాలను, సరైన అంకెలను సూచిస్తూ, సరైన పేర్లతో జతచేయండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| టిప్పుసుల్తాన్ | 1 | షాజహాన్ | 4 | పురుషోత్తముడు | 7 |
| కుబేరుడు | 2 | ధృతరాష్ట్రుడు | 5 | శివాజీ | 8 |
| షేర్‌షా | 3 | భగీరథుడు | 6 | దశరథుడు | 9 |





ఈ లేబిల్‌ను బంపర్‌ప్రైజు కోసం భద్రపరచండి

బంబర్ ప్రైజుకు (డిసెంబర్ సంచికలో) ప్రయత్నించేప్పుడు, మీరు దీనిని బంపర్ సెక్షన్ ఎంట్రీఫారంమీద అతికించవలసి వుంటుంది.

చందమామ

పోటీ 1

## పోటీ : 1

(ఎంట్రీఫారం)

ఇప్పుడు, పైనవున్న ఆరు చిత్ర పటాల పేర్లలో ఏ ఒక్క రాజు పేరునైనా తీసుకుని, 'ఎందుకంటే'........తరవాత వాక్యాన్ని పూర్తిచేయండి. ఈ వాక్యం పదిహేను మాటలకు మించకూడదు.

"నేను.................................... రాజుగా ఉండడానికి ఇష్టపడేవాణ్ణి.

ఎందుకంటే..........................................................................

..........................................................................................

..........................................................................................

పేరు......................................................................................

వయసు............చిరునామా...............................................................

..........................................................................................

ఈ పేజీని కత్తిరించి, పోటీ కూపన్ మీ దగ్గరే ఉంచుకుని, ఎంట్రీఫారం కవరు మీద పోటీ-1 అని రాసి, వెంటనే కింది చిరునామాకు పోస్టు చేయండి:

**చందమామ పోటీ 1**
చందమామ పబ్లికేషన్స్
188, ఆర్కాట్ రోడ్
మద్రాసు-600 026

పోటీ: 1 ఆఖరుతేది: అక్టోబర్ 31, 1987

ఈ లేబిల్‌ను బంపర్ ప్రైజు కోసం భద్రపరచండి

**మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ**

మనదేశపు అద్భుతాలు:

# హంపి

పద్నాలుగవ శతాబ్దంలో నిర్మించబడిన హంపీ నగరం బెంగళూరు నగరానికి 400 కి. మీ. దూరంలో తుంగభద్రా నది తీరంలో వెలుగొందుతున్నది. ఉత్తరోత్తరా ఈ నగరం విజయనగర సామ్రాజ్యానికి రాజధానిగా ప్రసిద్ధి గాంచింది.





హరిహరరాయలనే రాజకుమారుడు విద్యారణ్య స్వామిని దర్శించి, తాను సమీప అరణ్యంలో వేటాడుతూన్నప్పుడు, ఒక చోట కుందేళ్ళు వేటకుక్కలను తరమడం చూశానని చెప్పాడు. ఆ ప్రదేశమే రాజధానీ నగర నిర్మాణానికి సరైనదని విద్యారణ్యుడు అతనికి సూచించాడు.

విద్యారణ్యస్వామి ధ్యానంలో కూర్చుని, హరిహరరాయలకూ, అతని సోదరుడయిన బుక్కరాయలకూ, అక్కడ పట్టణ నిర్మాణానికి కావలసిన ధనం సమకూర్చమని భువనేశ్వరీ దేవిని ప్రార్థించారు. ఆ ప్రార్థన ఫలించి, ఒకనాటి రాత్రి హరిహర, బుక్కరాయుల సమక్షంలో స్వర్ణవర్షం కురిసింది.





మొదట హరిహరరాయులూ, ఆయన తరవాత బుక్కరాయలూ రాజ్యపాలన చేశారు. సుప్రసిద్ధ వ్యాకరణ కర్త సాయణుడూ, అతని సోదరుడైన మాధవాచార్యుడూ వారి ఆస్థానంలో మంత్రులుగా పనిచేశారు.

విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన నాలుగు వంశాలలో, శ్రీకృష్ణదేవరాయలు జగద్విఖ్యాతిగాంచాడు. 1509 నుంచి 1529వ సంవత్సరం వరకు రాజ్యపాలన చేసిన కృష్ణదేవరాయలు గొప్ప పరిపాలనాదక్షుడుగానే కాకుండా, సాహితీ పోషకుడుగానూ, కళాప్రియుడుగానూ పేరుగాంచాడు. ఆయన బ్రహ్మాండమైన అనేక భవనాలూ, ఆలయాలూ నిర్మించాడు.





తన పూర్వులపై మాటిమాటికీ దాడులు జరుపుతూ వచ్చిన బిజాపూర్, బిదార్ సుల్తాను సేనలను కృష్ణదేవరాయలు సర్వనాశనం చేశాడు. ఆయన కాలంలో, శత్రుబాధ లేకుండా సువిశాల సామ్రాజ్యం శాంతి సుఖాలతో విలసిల్లింది.

అయినప్పటికీ, బిజాపూర్, గోల్కొండ, అహ్మద్ నగర్, బిదార్ సేనలు కలిసికట్టుగా ఒక్కుమ్మడిగా, దాడి జరిపిన తళ్ళికోట యుద్ధానంతరం, 1565వ సంవత్సరంలో సుసంపన్నమైన సుందర హంపీ నగరం శత్రుసేనల దాడికి గురి అయింది. భవనాలన్నీ నేలమట్టమయ్యాయి.





ఇక్కడి ఆలయాలలోకెల్లా పెద్దది— విశాలమైన మంటపంతో వెలుగొందె పట్టాభిరామ దేవాలయం. అచ్యుత రాయలు (1530-42) నిర్మించిన ఈ ఆలయం ప్రస్తుతం శిథిలాల నడుమ వుంటున్నది.

బాలకృష్ణుడి ఆలయమైన విఠల మందిర ప్రాంగణంలోని ఈ రాతి రథం ఇక్కడి విలక్షణమైన శిల్పకళకు చక్కటి ఉదాహరణ.





అద్భుతమైన విజయనగర శిల్పకళా సంపదకు మరొక మనోహరమైన ఉదాహరణ ఈ లక్ష్మీనరసింహ విగ్రహం. ఈ నాటికీ హంపి ఇటువంటి అపురూపమైన శిల్పకళా ఖండాలకు నిలయంగా వెలుగొందుతున్నది.



# గడ్డిచొక్కా

చాలాకాలం క్రితం జపానులోని ఒక గ్రామంలో ఓటోకో అనే పనికిమాలిన అల్లరి వెధవ ఒకడుండేవాడు. ఒక రోజున వాడు ఏమీ తోచక ఒక వెదురుకర్ర తీసుకుని, దాని కణుపులను తొలిచి, పొడుగాటి గొట్టం తయారు చేసి, దాన్ని కంటికి పెట్టుకుని, దుర్భిణిలో నుంచి చూసినట్టు చూసేసరికి, గాలిలో ఎగురుతూ టెంగు అనే జాతికి చెందిన పిశాచి ఒకటి కనిపించింది.

టెంగుజాతి పిశాచాలు ఆ కాలంలో జపానులో అప్పుడప్పుడూ మనుషులకు కనిపిస్తుండేవి. అయితే వాటి జోలికి పోవటం చాలా ప్రమాదం.

ఓటోకో చూసిన టెంగుపిశాచికి చాలా పొడవైన ముక్కున్నది. దాని భుజాల మీద అలంకారంగా రెండు రెక్కలున్నాయి. అది ఎండుగడ్డితో అల్లిన చొక్కా ఒకటి ధరించి ఉన్నది. ఆ పిశాచం తన కేసే ఎగిరి వస్తూండటం చూసి, ఓటోకో దాని గడ్డిచొక్కా ఎలాగైనా కాజెయ్యాలనుకున్నాడు.

పిశాచం నేల మీద దిగే సమయానికి ఓటోకో వెదురు గొట్టంలో నుంచి ఆకాశం కేసి చూస్తూ, "ఆహా! ఓహో! అద్భుతం!" అంటున్నాడు. పిశాచానికి పట్టరాని ఆసక్తి పుట్టుకొచ్చి, ఓటోకో చుట్టూ గెంతుతూ, పీలగొంతుతో, "ఏమిటది? నన్ను కూడా కాస్త చూడనీ," అన్నది.

"ఏమిటీ? నేను కష్టపడి చేసుకున్న దుర్భిణిని నీ కిమ్మంటావా? ఇంకా నయం!....ఓహో! దీనిలో నుంచి చూస్తే చంద్రుడెంత అందంగా ఉన్నాడు! ఏ మా పర్వతాల అందం! ఆ లోయల చందం!" అన్నాడు ఓటోకో.

వాడు చంద్రుణ్ణి వర్ణిస్తున్న కొద్దీ పిశాచానికి చంద్రుణ్ణి ఆ దుర్భిణిలోంచి

జపాను జానపద కథ



చూడాలన్న తహతహ జాస్తి అయింది. ఆ గొట్టంలో తనను చూడనిస్తే, అది ఓటోకోకు తన చెప్పులిస్తానన్నది. తన టోపీ ఇస్తానన్నది. పిశాచం తన గడ్డి చొక్కా ఇస్తానన్నదాకా ఓటోకో బెట్టుచేసి, వెదురు గొట్టాన్ని పిశాచానికిచ్చి, దాని గడ్డిచొక్కా తీసుకుని అదే పోతపోయాడు.

పిశాచం కనుచాటు కాగానే ఓటోకో గడ్డిచొక్కా తొడుక్కుని, తక్షణమే అదృశ్యుడై పోయాడు. వాడితోబాటు చొక్కా కూడా అదృశ్యమైపోయింది. ఓటోకో ఆనందానికి మేర లేదు. వాడు ఎగురుకుంటూ గ్రామంలోని పెద్ద వీధికి వెళ్ళి, రకరకాల అకతాయి వేషాలు వెయ్యసాగాడు—మనుషుల నెత్తి మీద ఉండే బరువులు పడదోశాడు; దుకాణాల లోని వస్తువులుచిందరవందరగాపారేశాడు.

వీధిలో జనం కంగారెత్తిపోయారు. ఎక్కడివాళ్ళక్కడ దాక్కుని వీధి కేసి వింతగా చూడసాగారు. వీధి త్వరలోనే నిర్మానుష్య మయింది గాని, వింత చేష్టలింకా జరుగుతూనే ఉన్నాయి. నిర్జనమైన వీధి వెంట ఒక గొప్పవాడు ఠీవిగా నడుస్తూ వచ్చాడు. అకస్మాత్తుగా ఆ గొప్పవాడి ఎడమ చెవిని ఎవరో మెలిపెట్టినట్టయింది. ఆయన ఆగ్రహావేశంతో వెనక్కు తిరిగే సరికి, ఎవరో ఆయన కుడి చెవిని పట్టుకుని గుండ్రంగా తిప్పారు. ఆయన కూలబడి చుట్టూ కలయచూస్తుంటే, తలుపుల చాటు నుంచి ఈ దృశ్యాన్ని చూస్తున్న జనానికి భయంతోబాటు, పొట్ట చెక్కలయ్యే నవ్వు కూడా వచ్చింది.

ఇంతలో ఎవరో రైతు ఖరీదైన బట్టలు కొని, వాటిని చేత బట్టుకుని వస్తున్నాడు. అకస్మాత్తుగా ఆ మనిషి చేతిలో ఉండే బట్టలు గాలిలోకి తేలి, దూరంగా వెళ్ళి వీధి పక్కన ఉన్న మురుగుగుంటలో పడిపోయాయి.

మరొక చోటికి అప్పుడే పట్టిన చేపలు వచ్చాయి. రాత్రి వంటకు చేపలు కొన వచ్చిన స్త్రీలు తమకు కావలిసిన చేపలను



ఏరి కొనుక్కుంటున్నారు. అంతలో ఒక పెద్ద చేప, ప్రాణం వచ్చినట్టుగా, చివాలున గాలిలోకి లేచి, తేలుతూ వెళ్ళిపోసాగింది. చేప లమ్మేవాళ్ళు దాని వెంటపడ్డారు. వాళ్ళు దాన్ని సమీపించే సమయానికి అది వాళ్ళ కాళ్ళముందు పెద్ద చప్పుడుతో పడిపోయి, దుమ్ము కొట్టుకున్నది.

ఇలా కొంతసేపు ఆకతాయితనం చేసి అలిసిపోయి, ఓటోకో ఇంటికి వెళ్ళాడు. వాడు ముందు వాకిలి కుండా లోపలికి వచ్చి, గడ్డిచొక్కా విప్పి మళ్ళీ తన సహజరూపంతో కనిపించేసరికి, వాడి తల్లి ఉలిక్కిపడింది. ఎందుకంటే తన కొడుకు లోపలికి రావటం ఆమె చూడనే లేదు.

తన కొడుకు పడుకుని నిద్రపోయాక, ఆమె వాడి గడ్డిచొక్కా తీసి చూసి, "ఛీ, ఛీ! ఈ చెత్త చొక్కా వీడి కెక్కడ దొరికింది?" అనుకుని, దాన్ని తీసుకుపోయి పొయిలో పెట్టేసింది. క్షణంలో అది కాస్తా బూడిద అయిపోయింది.

ఓటోకో నిద్ర లేస్తూనే తన గడ్డిచొక్కా కోసం ఇల్లంతా తెగ వెతికాడు. తల్లి నడిగితే, దాన్ని పొయిలో పెట్టానని చెప్పింది. ఓటోకోకు అమితమైన కోపం వచ్చింది. చొక్కా మహిమ బూడిదలో కూడా ఉండవచ్చునన్న ఆశతో వాడు ఆ బూడిదనంతా ఎత్తి ఒక బుట్టలో చేర్చాడు. తరవాత వాడా బుట్టను దొడ్లో మూలకు తీసుకుపోయి, తన బట్టలన్నీ విప్పేసి, ఆ బూడిదను ఆపాదమస్తకమూ పులుముకోసాగాడు. బూడిద అంటిన తన శరీర భాగాలు అదృశ్యమైపోతూండటం గమనించి వాడికి అంతులేని ఆశ్చర్యం వేసింది. గడ్డిచొక్కాకు గల ప్రభావం, దాని బూడిదలో కూడా ఉన్నదని వాడికి స్పష్టమయింది. ఓటోకో పూర్తిగా అదృశ్యుడై పోయాడు.

తన ఎత్తు పారినందుకు వాడు పరమానందం చెంది, పెద్ద వీధి కేసి బయలు దేరాడు. వీధి రద్దీగా ఉన్నది. వాడు అదృశ్యంగా ఆ జనం మధ్య నడుస్తుండగా,

''సాకీ'' అనే సారాయి అమ్మే దుకాణం నుంచి వాసనకొట్టింది. దుకాణదారు ఒక పెద్ద పీపానుంచి అందరికీ సాకీ ఇస్తున్నాడు.

పీపా దగ్గిర ఎవరూ లేని సమయం చూసి, ఓటోకో పీపా కొళాయి దగ్గర చేరి, కొళాయికి మూతి పెట్టి గడగడా తాగ సాగాడు. గడగడ శబ్దం దుకాణదారుకు వినిపించింది గాని, అది ఎలా వస్తున్నదీ తెలుసుకో లేకపోయాడు. అతను దగ్గిరికి వచ్చి చూసేసరికి, మనిషి మూతి మాత్రం కనిపించింది. ఎందుకంటే, ఓటోకో మూతికి పూసుకున్న బూడిద సాకీతో కరిగి పోయి, మూతి మాత్రం ఉండటం చూసి దుకాణదారు దిగ్భ్రమ చెంది చూస్తూండ గానే, సాకీ ధారలు కారి ఓటోకో గడ్డం కొంచెం కొంచెమే బయటపడ సాగింది.

దుకాణదారు పెద్ద పొలికేక పెట్టేసరికి ఓటోకో భయపడి లేచి నిలబడ్డాడు. వాడికి చెమటలు పోయసాగాయి. చెమటతో తడిసిన వాడి శరీర భాగాలు, చెరిగిపోయిన చిత్తరువులో లాగా బయటపడ సాగాయి.

తన ఆట కట్టయిందని తెలుసుకుని ఓటోకో దుకాణంలో నుంచి బయటికి వచ్చి వీధి వెంట పరిగెత్త సాగాడు. దుకాణంలో చేరిన వాళ్ళంతా వాడి వెంట పడ్డారు. ఓటోకో పరిగెత్తి, పరిగెత్తి ఒక కాలవలోకి దూకాడు. వాడు తల బయటికి పెట్టి, చలికి వణుకుతూ నీటిలో ఉండి పోయాడు.

వాణ్ణి తరుము కొచ్చిన వాళ్ళు ఇప్పుడు ఓటోకోను గుర్తించి, వాణ్ణి పైకి లాగి, వాడి మీద ఒక కిమోనో కప్పారు.

''నీ కీ దుర్గతి ఎలా పట్టిందిరా, ఓటోకో ?'' అని గ్రామ పెద్ద అడిగాడు.

ఓటోకో సిగ్గుపడుతూ తాను టెంగు పిశాచిని మోసం చేసి గడ్డిచొక్కా సంపాదించిన ఉదంతమంతా వాళ్ళకు చెప్పాడు. వాడి కథ విన్నవాళ్ళు విరగబడి నవ్వి, ''టెంగుపిశాచినే మోసం చేద్దా మనుకున్నావా ? ఎంత మూర్ఖుడివి !'' అన్నారు. వాళ్ళు ఆ నవ్వులో వాడు వేసిన ఆకతాయి వేషాలను క్షమించి వదిలేశారు.





# కృష్ణావతారం

ఆదికాలంలో కాలనేమి అనే గొప్ప రాక్షసు డుండేవాడు. వాడికి నూరు చేతులూ, నూరు తలలూ ఉండేవి. చూడ టానికి మహాభయంకరంగా, నూరు శిఖ రాలు గల నల్లని పర్వతం లాగుండేవాడు. అసాధారణమైన బలానికి తోడు, వాడు తపస్సు చేసి బ్రహ్మనుంచి అనేక గొప్ప వరాలు కూడా పొంది చెప్పలేనంతగా మదించాడు.

ఆ కాలంలో దేవదానవులకు తరుచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ఒకప్పుడు దానవులు గెలిచేవారు, ఒకప్పుడు దేవ తలు గెలిచేవారు. ఒకసారి యుద్ధంలో దేవతలు ఘనవిజయం సాధించి, దానవు లను తరిమికొట్టారు. అది తెలిసి కాల నేమికి మహాగ్రహం వచ్చింది. వాడు దానవనాయకు లందరినీ కూడగట్టి, వారిని యుద్ధానికి ప్రోత్సహించి, సైన్యాలను సమ కూర్చుకుని, ఇంద్రుడి పైకి యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడి నాయకత్వాన దేవ తలూ, కాలనేమి నాయకత్వాన దానవులూ తలపడి, మహాభయంకరంగా యుద్ధం చేసారు.

ఆ యుద్ధంలో కాలనేమి ఇంద్రుడితో బాటు మిగిలిన దిక్పాలకులను కూడా చిత్తుగా ఓడించేశాడు. మూడు లోకాలూ అతని అధీనమయాయి. విష్ణుమూర్తి దేవతలకు జరిగిన పరాభవాన్ని చూస్తూ కూడా, కాలనేమికి కాలపరిపాకం కాలే దని గ్రహించి ఊరుకున్నాడు.

1. కాలనేమి కథ



కాలనేమికి మాత్రం విష్ణువును కూడా జయించాలని బుద్ధి పుట్టింది. అతను ఒకనాడు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, "నీవు మా మధు కైటభులను చంపావు. మా దైత్యులలో మణిలాటి హిరణ్యకశిపుణ్ణి గోళ్ళతో చీల్చి చంపావు. మా బలిని పాతాళానికి తొక్కేసి, మూడు లోకాలూ ఆక్రమించావు. మా దైత్యస్త్రీల కన్నీరుతో దేవత లనే పొలాన్ని తడిపి కాపాడావు. అందుకు పగ తీర్చుకోవటానికి వచ్చాను." అన్నాడు.

"పోతరించి కారుకూతలు కూసిన మాత్రాన నీచేత ఏమవుతుంది? శూరుడైన వాడెక్కడైనా ప్రగల్భాలాడతాడా? బ్రహ్మ ఇచ్చిన వరాల మూలాన పొగరెక్కి ఒళ్లు తెలియని పనులు చేశావు. పూర్వం దానవులకు పట్టిన గతే నీకు పట్టబోతుంది. నిన్ను తప్పక చంపి దేవతలకు వారివారి స్థానాలు తిరిగి ఇప్పిస్తాను." అని విష్ణుమూర్తి అన్నాడు.

ఆ మాటలు విని కాలనేమి ఉగ్రుడై, ఘోరమైన తన గదను గరుత్మంతుడికి గురి చూసి విసిరి, పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది గరుత్మంతుణ్ణి, వజ్రాయుధం కొండను తాకినట్టు తాకింది. విష్ణువు ఒక్క క్షణం నిర్ఘాంతపోయాడు. మరుక్షణమే ఆయన గరుత్మంతుడి బాధ పోగొట్టి, తన శరీరంతోబాటు గరుడుడి శరీరం కూడా పెంచి, చేతిలోకి తన సుదర్శనచక్రం తీసుకుని కాలనేమిపై విసిరాడు. అది అమిత వేగంగా వెళ్ళి కాలనేమి తలలనూ, చేతులనూ తరిగి పారేసింది. ఆ రాక్షసుడి శరీరం మటుకు ఇంకా అలాగే నిలబడి ఉండటం చూసి గరుత్మంతుడు బలమైన తన రెక్కలు విసిరి, గాలి పుట్టించి ఆ శరీరాన్ని పడిపోయేలాగు చేశాడు. ఇది చూసి కాలనేమి అనుచరులైన రాక్షస వీరులు హడలిపోయి ఎక్కడివాళ్ళక్కడ కుక్కిన పేలలాగా అయిపోగా, విష్ణువు వాళ్ళను చంపేశాడు.

రాక్షసులు చావగానే బ్రహ్మ, ఇంద్రుడూ, ఇతర దేవతలూ విష్ణువును చూడవచ్చి, ఆయనను ఎంతగానో ప్రశంసించారు.

"ఇంక మీకు రాక్షస భయం ఉండదు. ఎప్పటిలాగే మీరు మీమీ లోకాలను నిశ్చింతగా ఏలుకోండి. ఇక యజ్ఞాలు నిర్విఘ్నంగా సాగుతాయి. కాని దుష్టబుద్ధులైన రాక్షసులను మాత్రం ఒక కంట కనిపెట్టి ఉండండి," అని విష్ణువు వారితో చెప్పాడు.

తరవాత ఆయన పాలసముద్రానికి వెళ్ళి, తన శేషపాన్పు పైన పడుకుని యోగనిద్రలో మునిగిపోయాడు.

విష్ణువు యోగనిద్రలో ఉండగానే కృతయుగం వెళ్ళిపోయింది, త్రేతాయుగం కూడా అంతానికి వచ్చింది. ఆ సమయంలో భూదేవి ప్రజాభారం హెచ్చయిందని ఆక్రోశించింది. ఆ ఆక్రోశం విని దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి, విషయం తెలియచెప్పి, బ్రహ్మను వెంటబెట్టుకుని విష్ణువును చేరి, ఆయనను యోగనిద్ర నుంచి మేల్కొలిపారు.

విష్ణువు మెల్లిగా కళ్ళు తెరిచి దేవతలను చూసి, "ఏం ఇలా వచ్చారు? మీరంతా సుఖంగా ఉన్నారు గద? లోకాలు రాక్షసబాధ లేకుండా సుఖంగా ఉన్నాయి గద?" అని కుశలప్రశ్నలు వేశాడు.

బ్రహ్మ చేతులు జోడించి, "మహానుభావా, రాజుల మధ్య ఏ విధమైన





శత్రుత్వాలూ లేవు. సత్యమూ, ధర్మమూ స్థిరంగా ఉన్నాయి. యాగాలు చక్కగా జరుగుతున్నాయి. దేవకార్యాలూ, పితృకార్యాలూ నిర్విఘ్నంగా తృప్తికరంగా సాగుతున్నాయి. ఎవరికీ ఎటువంటి రోగాలూ, రొష్టులూ లేవు. మానవులు సంపూర్ణాయువు కలిగి ఉన్నారు. ఏ పట్టణం చూసినా, పల్లె చూసినా అపారమైన జనసంఖ్య కలిగి ఉన్నది. జనభారం మొయ్యలేనో అని భూదేవి దీనంగా ఆక్రోశిస్తున్నది. ధర్మహాని కలగకుండా పెరిగిపోతూన్న ఈ భూభారాన్ని తగ్గించే ఉపాయమేదో నీవే చూడాలి. నీవు మేరుపర్వతానికి దయచేసి, అక్కడ మా అందరికీ కర్తవ్యబోధ చెయ్యవలసిందని ప్రార్థన,'' అన్నాడు వినయంగా.

విష్ణువు లేచి కూర్చుని తన ఆభరణాలు చక్కజేసుకుని, బట్ట బిగించుకుని, నిలబడి, తన శంఖచక్రాది ఆయుధాలు ధరించి, గరుడవాహనారూఢుడై క్షణంలో మేరుపర్వతానికి వచ్చాడు. ఆ పర్వతం మీద పూర్వం విశ్వకర్మ నిర్మించిన దివ్యమైన సభ ఒకటి ఉన్నది.

ఆ సభలో ఉన్నతాసనం మీద మహావిష్ణువు కూర్చున్నాడు. మిగిలిన వారంతా ఉచితాసనాలపైన కూర్చున్నారు. ఆ సభకు యక్షులూ, గంధర్వులూ, సిద్ధులూ, విద్యాధరులూ, నాగులూ మొదలైన వారంతా కూడా వచ్చారు.

అక్కడికి భూదేవి పుట్టెడు దిగులుతో వచ్చింది. ఆమెను చూడగానే అందరూ ఒక్కసారిగా మాట్లాడారు. వాయుదేవుడు చెయ్యెత్తి కలకలమంతా వారించి, భూదేవితో ఆమె అక్కడికి వచ్చిన పని ఏదో చెప్పమన్నాడు.

''మీకు తెలియనిదేమున్నది? రాజులు అపారంగా పెరిగిపోయారు. ప్రజాభారంతో కృశించిపోతున్నాను. ఈ భారం తగ్గకపోతే నేను బతకలేను. ఈ విష్ణుమూర్తి తలుచుకుంటే ఈ పని సులభంగా జరుగుతుంది. పెద్దలు మీరంతా కూడా

ఉన్నారు.'' అన్నది భూదేవి ఎంతో విచారంగా.

భూదేవి చెప్పిన ఈ మాటలు విని సభలో వాళ్ళు తమలో తాము మాట్లాడుకుని, బ్రహ్మదేవుడితో, ''భూదేవి బాధ మాన్పటం మన కర్తవ్యం. నీవు పెద్ద వాడవు, సృష్టికర్తవు.'' అన్నారు.

అప్పుడు బ్రహ్మ లేచి సభాసదులతో ఇలా చెప్పాడు :

''ఒకనాటి సాయంకాలం నేనూ, కశ్యప మహాముని సముద్రతీరాన కూర్చుని తత్వ విచారం జరుపుతూండగా, చంద్రోదయం వేళ గంగాసంగమం చేత పొంగిన సముద్రుడు ఆకాశమంత ఎత్తు లేచి, మేము కూర్చున్న ప్రదేశమంతా ఆక్రమించటమే గాక మమ్మల్ని కూడా తడిపాడు. నేను నవ్వుతూ, ''ఇదేం పని ? శాంతించు !'' అన్నాను. వెంటనే సముద్రుడు శాంతించి, మానవరూపం ధరించి, గంగతో సహా మా ఎదట నిలిచాడు. అప్పుడు నేను భవిష్యత్తు గురించి ఆలోచించి, ''సముద్రుడా, ఇలా రాజసం చూపావు గనక భూమిపై రాజువుగా జన్మించు. నేను చెప్పగానే శాంతించావు గనక శంతనుడనే పేరుతో, ఈ గంగనే భార్యగా చేసుకుని జీవించు,'' అన్నాను. సముద్రుడు, నాకు నమస్కరించి, ''పర్వపువేళా,



గాలి ఎగవీచినప్పుడూ, చంద్రోదయవేళా పొంగటం నా స్వభావలక్షణం. అందులో దుర్బుద్ధి ఏమీ లేదు. అలాటప్పుడు నన్ను శపించటం ధర్మమా ?'' అని అన్నాడు.

''నాయనా, లోకహితం కోరి నేనీ మాట అన్నాను. నీవు పవిత్రమైన భరత వంశంలో పుట్టు. ఈ గంగకు వసువులను కని, వారికి వసిష్ఠుడిచ్చిన శాపం తీర్చు. తరవాత సత్యవతి అనే ఆమెకు వంశోద్ధారకులైన కొడుకులిద్దరిని కని జన్మ చాలించు'' అని చెప్పాను.

ఆ శంతనుడి కొడుకైన విచిత్రవీర్యుడికి ధృతరాష్ట్రుడూ, పాండుడూ అనే కొడుకులు కలుగుతారు. ధృతరాష్ట్రుడికి నూరుగురు



కొడుకులూ, పాండుడికి అయిదుగురు కొడుకులూ పుట్టుతారు. ఆ నూరుగురికీ, అయిదుగురికీ మధ్య రాజ్యకాంక్ష కారణంగా మహాయుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో భూమిపై గల రాజులందరూ నశిస్తారు. అనేక లక్షల ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ పీనుగులైపోతారు. భూభారం తగ్గిపోయి ఈ భూదేవి సుఖపడుతుంది. కలహకారకుడైన కలి అంశ ధృతరాష్ట్రుడి భార్య గర్భానా, యముడి అంశ పాండుడి భార్య గర్భానా పుట్టటం జరుగుతుంది. ఇంకా అనేకమంది దేవముఖ్యుల అంశలు వేరువేరు మానవజన్మలెత్తుతాయి.''

బ్రహ్మ చెప్పిన ఈ మాటలు విని అందరూ ఆయనను అభినందించారు. అదే సమయంలో నారదు డా సభకు విచ్చేశాడు.

ఆయన వీణ వాయిస్తూ పాటపాడి, విష్ణువునూ, దేవతలనూ రంజింపజేసి, విష్ణువుతో, ''దేవా, భూమిపై గల రాజకులాన్ని నిర్మూలించటానికి ఈ దేవతలందరూ తలపెట్టిన ఈ పని నీవు పూనుకోకుండా ఎలా సఫలమవుతుంది? భూమిపైన నీ అంశ ఒకటి అవతరించాలి, మిగిలినవారి అంశలకు ఉత్సాహప్రేరణలివ్వాలి. అప్పుడు గాని ఈ దేవకార్యం నెరవేరదు. అది అలా ఉండగా, ఈ దేవాంశలతో పుట్టేవారి కెవ్వరికీ సాధ్యం కాని పని మరొకటి ఉన్నది. దాన్ని గురించి హెచ్చరించటానికే నే నింత త్వరగా ఇక్కడికి వచ్చాను. అదేమిటంటే, దేవాసుర యుద్ధంలో నీ చేత చచ్చిన రాక్షసు లందరూ భూమిపైన మానవజన్మలెత్తి ఉన్నారు. రాముడి చేత రావణుడు చచ్చిన అనంతరం ఆ రాక్షసుడి మేనల్లుడూ, మధు వనే వాడి కొడుకూ అయిన లవణు డనే వాడు, రాముడి అజ్ఞపై శత్రుఘ్నుడి చేత చంపబడ్డాడు. శత్రుఘ్నుడు అక్కడి మధువనాన్ని నిర్మూలించి, మధుర అనే పేరు గల

మహానగరం నిర్మించాడు. అక్కడ అనేక తరాల రాజులు పాలించి దాన్ని బాగా వృద్ధికి తెచ్చారు. ఇప్పుడక్కడ అనాటి కాలనేమి, కంసుడనే పేరుతో, ఉగ్రసేనుడనే భోజవంశపు రాజుకు కొడుకుగా పుట్టి ఉన్నాడు. వాడికి పూర్వజన్మ వాసన ఇంకా అలాగే ఉన్నది. మితిమించిన అహంకారంతో వాడు తన తండ్రిని చెరలో పెట్టి, తానే రాజై కూర్చున్నాడు. ఇలాగే అనేకమంది రాక్షసులు తిరిగి భూమిపై పుట్టారు. కాలనేమి మిత్రులందరూ కంసుడికి భృత్యులుగా పుట్టి కాళిందీ తీరానా, బృందావనంలోనూ, మధురాపురంలోనూ, ఇతరచోట్లా ఉన్నారు. కొందరు రాక్షసులు ప్రాగ్జ్యోతిషంలో పుట్టి నరకాసురుడికి సహాయంగా ఉన్నారు. ఈ రాక్షసుల నందరినీ చంపటానికి నీవు తప్పక మానవావతార మెత్తవలసి ఉన్నది,'' అన్నాడు.

విష్ణువు ఈ మాటలు విని, బ్రహ్మ కేసి తిరిగి, ''నేను అలాగే అవతార మెత్తుతాను. సృష్టికర్త నన్నెక్కడ పుట్టమంటాడు ?'' అన్నాడు.

దానికి బ్రహ్మ ''వరుణుడి యజ్ఞధేనువులను కశ్యపుడు కాజేశాడు. కశ్యపుడి భార్యలైన అదితీ, సురభీ వాటిని వరుణుడికి తిరిగి ఇయ్యకుండా అడ్డుపడ్డారు. వరుణుడు ఈ సంగతి నాతో మొరపెట్టుకోగా, నేను కశ్యపుణ్ణీ, అతని భార్యలనూ మానవజన్మ లెత్తమని శపించాను. ఆ కశ్యపుడు ఇప్పుడు వసుదేవుడై పుట్టి కంసుడి ఆవులకు అధిపతిగా ఉన్నాడు. కశ్యపుడి భార్యలు దేవకి, రోహిణి అనే వాళ్ళుగా పుట్టి వసుదేవుడికి భార్యలై ఉన్నారు. నీవు నీ అంశను రెండుగా విభజించి, వసుదేవుడి భార్య లిద్దరియందూ ప్రవేశపెట్టు,'' అని విష్ణుమూర్తితో అన్నాడు.

విష్ణుమూర్తి బ్రహ్మ ఆదేశానికి తృప్తిపడి, సభ చాలించి, అందర్నీ పంపేసి, తాను తన స్వస్థానమైన పాలసముద్రానికి తిరిగి వెళ్ళాడు.






ఒక గ్రామంలో ఇద్దరు కాపులుండేవారు. వారిద్దరిని గురించి ఆ ప్రాంతంలో ఎరగనివారు లేరు. వారిలో ఒకడు అమిత సాధువు, మందబుద్ధి కలవాడు కూడా.

రెండోవాడు జిత్తులమారి, చురుకైన వాడు. వాడు ఎంత తెలివిగల వాడంటే, వాడిచేత ఒకసారి మోసపోయిన వాళ్ళే మళ్ళీ మళ్ళీ మోసపోతూండేవారు.

మందబుద్ధి చాలా పేదవాడు. వాడికి బండి లేదు సరికదా, ఒక కంచరగాడిద అయినా లేదు. ఒకసారి వాడు తాను పండించిన పెండలాన్ని బస్తీకి తీసుకు పోయేందుకు తన స్నేహితుడైన మరొక కాపు వద్దకు వెళ్ళి, "రేపు నీ కంచర గాడిదను అరువిస్తావా?" అని అడిగాడు.

"నా కంచరగాడిద నిన్న మధ్యాన్న మనగా ఎటో పోయింది. ఇంతవరకు దాని జాడలేదు," అన్నాడు స్నేహితుడు.

"ఇప్పుడేం చేసేటట్టు? రేపు నా పెండలాన్ని బస్తీకి తీసుకుపోదామను కున్నాను," అన్నాడు మందబుద్ధి.

గ్రామం అవతలి చివర మరొక డున్నాడు. వాడు పెద్ద లోభి. వాడి దగ్గిర ఒక గుర్రం ఉన్నది. దాన్ని అరువు తెచ్చుకోమని స్నేహితుడు మందబుద్ధికి సలహా ఇచ్చాడు.

మందబుద్ధి సరేనని లోభివాడి దగ్గిరికి వెళ్ళి, "రేపు నీ గుర్రాన్ని అరువిస్తావా?" అని అడిగాడు.

లోభివాడు ఆలోచించి, "గుర్రాన్ని ఇస్తే కిరాయి ఏమిస్తావు?" అని అడిగాడు.

"నా దగ్గిర చిల్లిగవ్వలేదు. ఒక్కరోజు పని గనక, ఊరికేనే ఇస్తావేమో నను కున్నాను," అన్నాడు మందబుద్ధి.

"అదంతా వీలుపడదు. నా. గుర్రం కిరాయి రోజుకు పదిహేను గుమ్మడి




కాయలు, దానికి తక్కువయితే ఒప్పుకోను'' అన్నాడు లోభి.

''నా దగ్గిర ప్రస్తుతం అయిదు గుమ్మడికాయలే ఉన్నాయి. మిగిలిన పదీ కొన్నాళ్లయితే గాని ఇచ్చుకోలేను,'' అన్నాడు మందమతి.

''ఇప్పుడున్న అయిదూ ఇచ్చెయ్యి. మిగిలిన పదీ ఇచ్చినాక గుర్రాన్ని తీసుకుపో,'' అన్నాడు లోభి.

మందమతి సరేనని ఇంటికిపోయి, తన వద్ద వున్న అయిదు గుమ్మడికాయలూ లోభికి తెచ్చి యిచ్చాడు.

మర్నాడు తెల్లవారుతూనే స్నేహితుడు తన కంచరగాడిదను మందమతి దగ్గిరికి తెచ్చి, ''ఇదుగో, నా కంచరగాడిద. అర్ధరాత్రి వేళ తిరిగి వచ్చింది. నీ సరుకు దీని మీద వేసి బస్తీకి చేర్చుకో,'' అన్నాడు.

''నేనా లోభివాడి గుర్రాన్ని మాట్లాడుకున్నాను,'' అన్నాడు మందమతి.

''నా గాడిద దొరికింది గద, ఇంక వాడి గుర్రంతో ఏం పని?'' అన్నాడు స్నేహితుడు.

''వాడికి అయిదు గుమ్మడికాయలు బయానా కూడా ఇచ్చుకున్నాను. ఇప్పుడు గుర్రం వద్దంటే ఆ గుమ్మడికాయలు తిరిగి ఇవ్వడు,'' అన్నాడు మందమతి.

''చిక్కే వచ్చిందే! ఏమిటి ఉపాయం?'' అన్నాడు స్నేహితుడు.

సరిగా ఆ సమయంలోనే జిత్తులమారి అక్కడికి వచ్చాడు. సంగతంతా తెలుసుకుని, ''గుర్రం అక్కర్లేదని చెప్పి నీ గుమ్మడికాయలు నువు తెచ్చుకో. ఆ లోభి వెధవకు భయపడతావేమిటి?'' అన్నాడు.

''నాకు వాడంటే భయమే,'' అన్నాడు మందమతి.

''అయితే నావెంట రా. గుమ్మడికాయలెందుకివ్వడో చూస్తాం,'' అంటూ జిత్తులమారివాడు మందబుద్ధిని అక్కణ్ణుంచి బయలుదేరదీశాడు.

ఏం జరుగుతుందో చూద్దామని స్నేహితుడు కూడా వారి వెనకే వెళ్ళాడు.

వాళ్ళను చూసి లోభివాడు, "ఏం వచ్చారు?" అని అడిగాడు.

"గుర్రం కోసమే. ఏదీ నీ గుర్రం?" అన్నాడు జిత్తులమారి.

"అదుగో, అ కనిపించేదే. మిగిలిన పది గుమ్మడికాయలూ ఇవ్వందే గుర్రా న్నివ్వను," అన్నాడు లోభి.

"అంత తొందరపడతావేం? గుర్రం చాలుతుందో లేదో ముందు చూడనీ!" అన్నాడు జిత్తులమారి.




"చాలటమేమిటి? గుర్రమన్న తరవాత గుర్రమే. గుర్రానికి చాలటమూ, చాలకపోవటమూ ఉంటుందా?" అన్నాడు లోభి.

"అంతేనా నీకు తెలిసింది? ఇప్పుడు కొలిచి చూస్తాం గద!" అంటూ జిత్తుల మారి వాడు గుర్రం వీపును తన జానతో కొలవనారంభించి, మందమతితో, "ఎంత లేదన్నా నీకు రెండు జానల చోటు కావాలి. నిన్ను మధ్య కూచోబెడతా మను కుందాం. నాకు జానా బెత్తా చాలు, నీ వెనక కూచుంటాననుకుందాం. నా భార్య నా వెనక కూచోవచ్చు. దానికీ రెండు జానలు కావాలి. నీ భార్యకు కనీసం రెండు జానల పైన ఒక బెత్తెడు చోటు కావాలి. అవిణ్ణి ముందు కూచో బెడతాం. పోతే పిల్లలకు చోటు చూడాలి. నీ కూతురు చిన్నదే గనక గుర్రం మెడ మీద కూచోవచ్చు. చిన్నవాడు దాని ఒళ్ళో కూచుంటాడు," అంటూ చెప్పుకు పోసాగాడు.

లోభివాడికి మాటలు వింటూంటే దడ పుట్టుకొచ్చింది. "ఆగండి! మీకే మన్నా మతులు పోయాయా ఏం? గుర్రం అంతమందిని మోస్తుందా ఎక్కడన్నా?" అన్నాడతను.

"ఆ సంగతి మాకు అనవసరం. అది గుర్రం చూసుకుంటుంది. అది దాని సమస్య. మా సమస్య అందరమూ ఈ గుర్రం మీద తీర్థానికి వెళ్ళగలమా అని!" అన్నాడు జిత్తులమారి.

"మీరంతా నా గుర్రం మీద ఎక్కి తీర్థానికి పోతారూ ?" అన్నాడు లోభి.

"కొంచెం ఇరుకవుతుందన్న మాటే గాని గుర్రం మీద చోటున్నది!" అన్నాడు జిత్తులమారి.

"ఇంకా నయం! నేనసలు మీకు గుర్రాన్ని కిరాయికివ్వను," అన్నాడు లోభి.

"మాట అనుకున్నాక వెనక్కి పోగూడదు. అది పెద్దమనిషి లక్షణం కాదు....అన్నట్టు, మీ అమ్మ మాటే మరిచాం! ఆవిణ్ణి ఎక్కడ కూచోబెట్టేటట్టు ? కోళ్ళకూ, మేకలకూ చోటేది ?" అన్నాడు జిత్తులమారి నిస్పృహ అభినయిస్తూ.

లోభికి వెర్రెత్తిపోయింది. వాడు గట్టిగా అరుస్తూ, "నా గుర్రాన్ని చంపుతారా ఏం ? నేను మీకు గుర్రాన్ని ఇవ్వను," అన్నాడు.

"అనుకున్న బేరం వెనక్కి లాగా వంటే నిన్ను న్యాయస్థానానికి ఈడుస్తాను, ఏమనుకున్నావో!" అన్నాడు జిత్తులమారి.

"మీ అయిదు గుమ్మడికాయలూ మీరు పట్టుకుపొండి. నాకీ బేరం వద్దనే వద్దు," అన్నాడు లోభి.

"మాట్లాడుకున్నది పదిహేను గుమ్మడికాయలైతే అయిదు గుమ్మడికాయలంటా వేమిటి? మోసం!" అన్నాడు జిత్తులమారి.

"నాకు మీరిచ్చింది అయిదు గుమ్మడికాయలే గద," అన్నాడు లోభి.

"అయిదు గుమ్మడికాయలకు నువు గుర్రాన్నిచ్చావా ఏం? పదిహేను గుమ్మడికాయలూ ఇస్తేనేగాని గుర్రాన్ని కిరాయికివ్వనంటివిగా ? బేరం మానుకోదలుచుకుంటే పదిహేను గుమ్మడికాయలూ నువ్విచ్చుకోక తప్పేదేముందీ ?" అన్నాడు జిత్తులమారి.

లోభి ఇంట్లోకి పరిగెత్తి పదిహేను గుమ్మడికాయలు తెచ్చి, "వీటిని తీసుకొని పొండి. మీకూ, మీ బేరానికీ ఒక దణ్ణం!" అన్నాడు.

వాటిని తీసుకుని ముగ్గురూ తమ ఇళ్ళకు బయలుదేరారు సంతోషంగా.





# అపకారికి ఉపకారం

**9**

పరదేశీ, ప్రియంవదా చెట్టుబోదెలో వున్న సొరంగంలో ప్రవేశించి లోపల గడియ బిగించిన కొద్దిసేపు తర్వాత, గ్రామస్థులు వచ్చి చూస్తే, ఎక్కడా పరదేశీ, ప్రియంవదల జాడలేదు. వాళ్ళు, ఆ ప్రాంతాలగల చెట్లనూ, పుట్లనూ వెతికి, చివరకు, ''పరదేశి మరెవరో కాదు, భగవంతుడి అంశగల మహానుభావుడు!'' అన్న నిర్ణయానికి వచ్చారు.

జరిగిన వింతచూసి, జయవిజయులు యిప్పుడేమి చేయడమా అని, ఆలోచిస్తున్నంతలో, గ్రామప్రజలు మూకఉమ్మడిగా వాళ్ళ మీద దాడిచేసి, నాటినుంచి పది సంవత్సరాలవరకూ, శతనందన గ్రామప్రాంతాల ఎక్కడ కనిపించినా, ప్రాణాలు దక్కవని చెప్పి, తరిమివేశారు.

సొరంగమార్గంలో ప్రవేశించిన ప్రియంవదకు, యీసారి ప్రయాణం యిబ్బంది అనిపించలేదు. తోడుగా పరదేశి వున్నాడు; ఆకలయినప్పుడు తినడానికి అహారపదార్థాలున్నాయి.

''మనం రాజభవనానికి వెళ్ళగానే, ఏం చేయాలి?'' అని పరదేశి, ప్రియంవదను అడిగాడు.

అందుకు ప్రియంవద, ''ఈసరికి, నన్నొక మహామాంత్రికుడు ఎత్తుకుపోయాడని రాజధానిలో పుకారు లేచి వుంటుంది. ఆ మాంత్రికుడి బారినుంచి, నువ్వు రక్షించావని, నా తండ్రికి చెబుతాను. మన వివాహం జరిగిపోతుంది,'' అన్నది.

''కాని, యిది అన్యాయం. ఇదేవిధంగా వివాహం చేసుకుంటానని, లోగడ నువ్వు

“వసుంధర”



కాపలాభటుడు జయుడికి మాట యిచ్చి వున్నావు,'' అన్నాడు పరదేశి.

''నిన్ను చూసేవరకూ, అలాగే అనుకున్నాను. ఆ భటుడు, నా ప్రాణాలు కాపాడినందుకు, ఏమైనా చేయాలనిపించిందే తప్ప, వాణ్ణి నేను ప్రేమించలేదు," అన్నది ప్రియంవద.

పరదేశి కొంచెంసేపు ఆలోచించి, ''నువ్వు, ఆ భటుణ్ణి పెళ్ళాడడమే న్యాయంఅనిపించుకుంటుంది," అన్నాడు.

ఈ మాటలు ప్రియంవదకు చాలా బాధ కలిగించాయి. ఆమె ఎంతో విచారంగా, ''నన్ను పెళ్ళాడడం, నీ కిష్టం లేదా ?'' అని అడిగింది.

''ఎందు కిష్టం లేదు ? నీ జాతకంలో, సామాన్యుడిని పెళ్ళాడతావని వున్నదన్నావు. ఆ వెంటనే, నీకోసం సామాన్యుణ్ణి కావాలన్న కోరిక నాలో కలిగింది. ఈ స్వార్థచింతనవల్ల, అప్పటివరకూ నాలో వున్న అద్భుతశక్తులన్నీ అదృశ్యమైపోయాయి. అపకారికైనా ఉపకారం చేయమనీ, ఏ పరిస్థితుల్లోనూ స్వార్థచింతన కూడదనీ—హిమాలయాల్లో తపస్సు చేసుకునే, నా గురువర్యులు నన్నాజ్ఞాపించారు. వారి ఆజ్ఞకు వ్యతిరేకంగా ప్రవర్తించాను,'' అని పరదేశి కొంచెం ఆగి, ''ఏది ఏమైనా, నా కారణంగా జయుడికి అన్యాయం జరక్కూడదు,'' అన్నాడు.

ప్రియంవద అతడికేమీ జవాబివ్వలేకపోయింది. తను రాజభవనం చేరాక, జయుడిని పిలిపించి, సంగతి చెప్పి, అతడి చేత తను పరదేశిని వివాహమాడేందుకు ఒప్పించాలనుకున్నది. ఇది జరిగితేతప్ప, పరదేశి తనను వివాహమాడడు.

కొంతకాలం గడిచాక, ఒక రాత్రివేళ, తన శయనాగారం చేరింది ప్రియంవద. ఆమె, పరదేశిని తాను పిలిచేవరకూ సొరంగంలోనే వుండవలసిందిగా కోరింది.

ఆ తర్వాత, ప్రియంవద శయనాగారంలోని గంటను మోగించింది. ఆ మరుక్షణం శయనాగారంలోనికి పదిమంది

పరిచారికలు వచ్చారు. రాకుమారి ప్రియం వద తిరిగి వచ్చిందన్నవార్త, క్షణాల మీద అంతఃపురంలో అందరికీ తెలిసిపోయింది. రాజు కీర్తిసేనుడూ, రాణి కాంతిమతీ పరుగు, పరుగున అక్కడికి వచ్చారు.



కాంతిమతి, ప్రియంవదను కౌగలించుకుని, "నా బంగారుతల్లీ! ఇంతకాలం ఏమయ్యావు? ఎక్కడున్నావు?" అని అడిగింది.

"అమ్మా, అదంతా ఒక పెద్ద కథ. తర్వాత చెబుతాను. ముందు, నా అంతఃపుర కాపలా భటులందర్నీ పిలిపించండి." అన్నది ప్రియంవద.

అలా కాపలా వుండే భటులు ఇరవై మంది. వాళ్ళు అంతఃపురం బయటా, ఉద్యానవనాల్లోనూ వుంటూ, రాకుమారిని వెయ్యి కళ్ళతో కాపాడుతూంటారు.

తన కుమార్తె, ఏదో ప్రత్యేకమైన కారణం వుండడం వల్లనే, కాపలాభటులను పిలిపించమంటున్నదని, రాజు కీర్తిసేనుడు, వాళ్ళకోసం కబురు పంపాడు. త్వరలోనే కాపలా వాళ్ళు అక్కడికి వచ్చారు. కాని, వాళ్ళలో జయుడు లేడు!

ప్రియంవద ఆశ్చర్యపోయి, తండ్రితో, "నాన్నా, ఈ కాపలాభటుల్లో జయుడనే వాడుండాలి. ఏమయాడు?" అని అడిగింది.

అందుకు జవాబుగా కాపలాభటుల నాయకుడు, "యువరాణీ! ఆ జయుడికి, తన మరదలితో వివాహ నిశ్చితార్థం జరగనున్నది. ఆ పని మీద వాడు నాలుగు రోజులు సెలవు తీసుకుని సొంతగ్రామానికి వెళ్లాడు. రేపు వాడు తిరిగిపనిలో ప్రవేశించవలసిన దినం," అని జవాబు చెప్పాడు.

అది విని ప్రియంవదకు పట్టరాని సంతోషం కలిగింది. ఆమె పెద్దగా ఆవులించి, "నాకు నిద్ర ముంచుకువస్తున్నది. విశ్రాంతి కావాలి," అన్నది.

ఆ వెంటనే అక్కడి నుంచి అందరూ వెళ్ళిపోయారు. ఆమె సొరంగంలో దాగివున్న పరదేశిని పిలిచి, జరిగినదంతా



చెప్పి, "ఇప్పుడు నన్ను పెళ్ళాడడం, నీకిష్టమే గదా ?" అని ప్రశ్నించింది.

"జయుడి వివాహం, అతడి యిష్టం మీద జరుగుతున్నదో, లేదో తెలియాలికదా. మన వివాహానికి, అతడు మనస్ఫూర్తిగా అంగీకరించాలి." అన్నాడు పరదేశి.

ప్రియంవద, పరదేశిని సారంగంలోకి పంపింది. మర్నాడు జయుడు ఉద్యానంలో వుండవలసిందిగా, రాజాజ్ఞ అయింది.

ప్రియంవద అక్కడికి పోయి, జరిగిన సంగతులేవీ జయుడికి చెప్పకుండా, "క్షేమంగా వున్నావా ? నీ పెళ్ళికి నిశ్చితార్థం జరిగిపోయిందట, నిజమేనా ?" అని అడిగింది.

"నిజమే, రాకుమారీ ! తమరు నన్ను క్షమించాలి. ఆనాడు—అనాలోచితంగా ఏదో కోరాను. ఎంతో కాలంగా, నా మరదల్ని వివాహమాడాలనుకుంటున్నాను. నిశ్చితార్థంతోపాటు, పెళ్ళిముహూర్తం కూడా నిర్ణయించారు." అన్నాడు జయుడు.

జయుణ్ణి పంపివేసి, ప్రియంవద సారంగంలో వున్న పరదేశిని కలుసుకుని, అతడికి జయుడి నిర్ణయం చెప్పి, "ఇప్పుడు నన్ను వివాహమాడేందుకు, ఎలాంటి అభ్యంతరం లేదు గదా !" అన్నది.

పరదేశి, ప్రియంవదను వివాహమాడేందుకు అంగీకరించాడు. అప్పుడామె, అతణ్ణి తల్లిదండ్రులవద్దకు తీసుకుపోయి, తాను సారంగమార్గం చివరివరకూ చూడగోరి వెళ్ళానని అబద్ధం చెప్పి—అతర్వాత జరిగినదంతా కథగా చెప్పింది.

కీర్తిసేనుడు, పరదేశి తన కుమార్తెకు చేసిన సహాయానికి సంతోషించి, "నా కుమార్తె కోసం, నీ అద్భుతశక్తు లన్నిటినీ త్యాగం చేసి, సామాన్యుడివై పోయావు. నీకు, నా రాజ్యాన్ని కానుకగా యిచ్చినా, నీకు కలిగిన లోటు తీరదు." అన్నాడు.

ఆ మాటలకు పరదేశి మందహాసంచేసి, "మహాప్రభూ, అపకారికి కూడా ఉపకారం చేసిన పుణ్యఫలమే, నాకు

రాజ్యంతోపాటు, రాకుమారి కూడా లభ్యమయేలా చేసిందనుకుంటాను! నేను రాజునయాక కూడా, నా స్వప్రయోజనం కాక, ప్రజల మేలే ముఖ్యమని భావించి, అందుకు తగిన విధంగా ప్రవర్తిస్తాను. వాళ్ళ కోసం ఎటువంటి త్యాగమైనా చేస్తాను. ఇందుకు మీరు అనుమతిం చాలి," అన్నాడు.

కీర్తిసేనుడు కొద్దిసేపు ఆలోచించి, "రాజైనవాడు, ప్రజల యోగక్షేమాలే ముఖ్యమన్న ధోరణిలో పరిపాలన సాగించాలన్నది, నా అభిమతం కూడా. నువ్వు త్రికరణశుద్ధిగా ప్రజలకు మేలు కలిగించాలనుకుంటే, అందుకు అనుమతించనన్న అనుమానం నీకెందుకు కలిగింది ?" అని ప్రశ్నించాడు.

"మీ పాలనలో శతనందనగ్రామం లాటి దొకటున్నది. ఏ రాజ్యంలో అయినా ప్రజలు మూర్ఖులుగా వుంటే, దాని పాలకుడు, తన విధిని సరిగా నిర్వహించడం లేదని గ్రహించవచ్చు." అన్నాడు పరదేశి.

"నువ్వు, నా కుమార్తెను వివాహం ఆడి రాజువు కాబోతున్నావు. రాజ్యంలో శతనందన గ్రామాల లాటివి మరెన్ని వున్నవో తెలుసుకుని, ఆ ప్రజల మూర్ఖత్వాన్ని పోగొట్టి, విద్యావంతులను చెయ్యి. నేను చాలా సంతోషిస్తాను," అన్నాడు కీర్తిసేనుడు.

పరదేశి, తనను వివాహం చేసుకోవడానికి అంగీకరించడంలో వున్న, కారణం, అప్పుడు ప్రియంవదకు అర్థమైంది. విశాల దేశ ప్రజలను, ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దాలని, పరదేశి ఆశిస్తున్నాడు.

ప్రియంవద, పరదేశి పాదాలముందు మోకరిల్లి, "నువ్వు సామాన్యుడివి కాదు! ముందు తరాలకు, నీ పరిపాలన ఆదర్శప్రాయమవుతుంది," అన్నది.

ఆ తర్వాత పరదేశి, ప్రియంవదను వివాహం చేసుకుని, ఉపకారసేనుడన్న పేరుతో, విశాలదేశాన్ని ప్రజారంజకంగా పరిపాలించి, ఆదర్శ ప్రభువుగా పేరు గాంచాడు. — (అయిపోయింది)





# ఆయుర్దాయం

విలాసపురి అనే నగరాన్ని, శ్వేతనందుడు అనే రాజు పాలించేవాడు. ఒక రోజు అతడు అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంటూ, ముఖంలో ఒకటి, రెండు చిన్న ముడతలు వుండడాన్ని గమనించాడు. దానితో ఆ క్షణం నుంచి శ్వేతనందుడికి, తాను వృద్ధుడనై పోతున్నానన్న తీరని బెంగపట్టుకున్నది.

పేరుమోసిన ఎందరో వైద్యులు వచ్చి, ఆ ముడతలు పోగొడతామని, అతడి చేత అపారంగా ధనం ఖర్చు చేయించి, రకరకాల ఔషధాలు తయారు చేసి యిచ్చారు. శ్వేతనందుడు, వాటన్నిటినీ శ్రద్ధగా సేవించాడు. కాని, అద్దంలో చూసుకున్నప్పుడల్లా, అతడికి ముడతలు మరింత పెద్దవైనట్టు కనబడసాగాయి. దీనితో అతడు ఎక్కడలేని విచారంతో కుంగిపోసాగాడు.

ఒకనాడు మంత్రి ముకుందవర్మ, అతడితో, "ప్రభూ, ఐదుపదులు కూడా పూర్తిగా నిండని తమకీ విచారం అప్పుడే తగదు. అయినా, సువర్ణనగరంలో వున్న, మలయజుడనే భిషగ్వరుడు, కాయకల్ప చికిత్సలో సిద్ధహస్తుడని, నాకు తెలిసింది. మీరు నవనవలాడుతూ కనబడాలంటే, అదొక్కటే శరణ్యంగా కనిపిస్తున్నది," అన్నాడు.

ఇందుకు శ్వేతనందుడు అయిష్టంగా, "సువర్ణనగరరాజు సింహవర్మ, మనకు బద్ధశత్రువు గదా! మలయజుడి నుంచి, నేను చికిత్స పొందకుండా, తప్పక అడ్డు తగులుతాడు," అన్నాడు.

"మనం, యీ చికిత్స గురించి మరెవరికీ తెలియకుండా రహస్యంగా వుంచుదాం. ధనికవర్తకుల వేషాల్లో మనం స్వయంగా సువర్ణ నగరం వెళ్ళి, ఆ

కమలిని

మలయజుడితో సంప్రదిద్దాం." అన్నాడు ముకుందవర్మ.

రాజూ, మంత్రీ మారువేషాల్లో, సువర్ణ నగరానికి బయలుదేరారు. దారిలో వారికి, ఒక చెట్టుకింద తీరిగ్గా కూర్చుని కూని రాగాలు తీస్తున్న ముసలివాడొకడు కని పించాడు.

ముఖమంతా ముడతలుపడి, దేహం బాగా శుష్కించిపోయివున్న, ఆ వృద్ధుడు, అంత ఆనందంగా వుండడం, రాజుకు చాలా ఆశ్చర్యం కలిగించింది.

ఆయన, మంత్రితో, "ఈ ముసలివాడు యింత సంతోషంగా వుండడం, నాకు ఆశ్చర్యాన్నే కాక ఎంతో అసూయను కూడా కలిగిస్తున్నది. వీడి సంతోషానికి కారణమేమిటో ఇప్పుడే తెలుసుకోవాలి," అన్నాడు.

ఇద్దరూ ముసలివాడి దగ్గిరకు వెళ్ళారు. శ్వేతనందుడు, వాణ్ణి, "పండు ముసలి వాడివికదా! అటువంటి నువ్వు, కుర్ర వాడిలా కూనిరాగాలు తీస్తూ, ఆనందపడి పోతున్నావు. ఇందుకు కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

ముసలివాడు, రాజు కేసి చురచుర చూస్తూ, "నేను పండుముసలినా? అలా అని ఖచ్చితంగా ఎలా చెప్పగలవు?" అని ఎదురుప్రశ్న వేశాడు.



అందుకు శ్వేతనందుడు నవ్వి, "నీ ముఖం మీద వున్న ముడతల్ని, ఎండు కట్టెలా వున్న నీ శరీరాన్ని చూస్తూంటే— నువ్వెంత ముసలివాడివో, ఎవరైనా గ్రహించగలరు," అన్నాడు.

"ముఖం మీది ముడతలా? ఎండు కట్టెలా వున్న శరీరమా? ఇది నిజమే కావచ్చు. ఈ చిహ్నాలన్నిటినీ, నేనెప్పుడో అరవైఏళ్ళ వయసులో వున్నప్పుడు— అంటే, యిప్పటికి నలభై సంవత్సరాల కిందట, ఒకటి, రెండుసార్లు అద్దంలో చూసుకున్నట్టు గుర్తు. ఈ మధ్యకాలంలో, వాటి సంగతే నాకు గుర్తులేదు," అని జవాబిచ్చాడు ముసలివాడు.

ఇది విని శ్వేతనందుడు ఆశ్చర్యపడి, ''ఇప్పుడు నీ వయసు నూరేళ్ళకు పైబడిం దన్నమాట!'' అన్నాడు.

ముసలివాడు అవునన్నట్టు తల వూపాడు.

రాజు, వాడికి తనెవరైనదీ, సువర్ణ నగరానికి ఎందుకు పోతున్నదీ చెప్పాడు.

ముసలివాడు మందహాసం చేస్తూ, ''ప్రభూ, కాయకల్ప చికిత్సకోసం, తమరు అంతదూరం వెళ్ళనవసరం లేదు. అదేమిటో నాకు తెలుసు!'' అని, రాజును మరి కాస్త దగ్గరకు రమ్మని, ఆయన చెవిలో ఏదో చెప్పాడు.

శ్వేతనందుడు నవ్వి, తన దగ్గిరున్న సంచీలోంచి కొన్ని బంగారునాణాలు తీసి, ముసలివాడికి యివ్వబోయాడు.

ముసలివాడు, వాటిని తీసుకునేందుకు నిరాకరించి, ''ప్రభూ, కలలో కూడా అనుకోని, తమ దర్శనభాగ్యం లభించింది; అదిచాలు. మీరివ్వజూపిన బంగారం, నేనేం చేసుకోను,'' అన్నాడు.

రాజు, మంత్రి అక్కడి నుంచి, తమ నగరానికి తిరిగి వచ్చారు. అయితే, ఎలాంటి చికిత్స జరక్కుండానే, రాజు ఆ రోజునుంచి ఎంతో ఉత్సాహంగా కనబడ సాగాడు.

ఈ మార్పుకు కారణం అర్థం కాని మంత్రి, ఒకనాడు రాజుతో, ''ప్రభూ, మీకు ఆ ముసలివాడు రహస్యంగా చెప్పిన దేమిటో, నేను తెలుసుకోవచ్చా ? మీరు అప్పటినుంచి విచారం నుంచి బయటపడి, ఉత్సాహంగా వుంటున్నారు,'' అన్నాడు.

దానికి శ్వేతనందుడు, ''పెరుగుతున్న వయసు కారణంగా, శరీరంలో వచ్చే మార్పుల్ని చూసి, విచారపడడం కన్న, ఆయుక్షీణం మరొకటి లేదు. వాటిని ఏమాత్రం పట్టించుకోకుండా, మనస్సును ఎల్లప్పుడూ ఆనందంగా వుంచుకునే వాడికి, అయుర్దాయం దానంతట అదే పెరుగు తుంది. ఆ ముసలివాడు, నాకు చేసిన కాయకల్ప చికిత్స యిదే!'' అని జవాబు యిచ్చాడు.




హౌలర్
దక్షిణ అమెరికాలోని హౌలర్ జాతి కోతులు, పరిమాణంలో సమానంగా వున్న ఇతర జంతువులకన్నా గట్టిగా అరుస్తాయి. వాటి నాలుకలో బోలుగా వున్న పలుచటి పెంకులాంటి ఎముక ఇలా పెడబొబ్బపెట్టడానికి దోహదం చేస్తున్నది!


ఈతరాని జంతువు
ఎటువంటి విపత్కర పరిస్థితి ఏర్పడినా సరే, జిరాఫీలు మాత్రం ఈదనే ఈదలేవు!


పెద్ద మొసళ్ళు తరచూ రాళ్ళను మింగుతాయి. ఈ రాళ్ళు ఆహారం జీర్ణంకావడానికి దోహదం చేస్తాయి. మొసళ్ళు మింగే ఇంచుమించు 4.77 కి. గ్రా. బరువుగల రాళ్ళు, మొసళ్ళు జలప్రవాహానికి కొట్టుకుపోకుండా ఆపి, నీళ్ళఅడుగున నేలపై అంటిపెట్టుకుని వుండడానికి సహాయ పడతాయి.
రాళ్ళు మింగే మొసళ్ళు




# మిఠాయిల మహారాజు కొత్త మిఠాయి అందిస్తున్నాడు-
# కాఫీ రుచిని కొరుక్కుతిని ఆనందించడానికి!







# కాఫీ బైట్




మృదువైనది, విలువైనది, మీగడ చేరిన మిఠాయి—అసలైన కాఫీ రుచి కలిపినది. మీరు కోరే రీతిలోనే తయారుచేసినది. ఈ రోజే కొనండి.

<u>రకరకాల ప్యారీస్ మిఠాయిలు:</u>

కారమెల్స్
చాకొలెట్ ఎక్లెయిర్స్
ట్రి-వీ • చాక్లెయిర్స్
కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • కాఫీ బైట్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో మొట్టమొదటి పేరు.




ప్యారీస్ అందిస్తున్న శ్రేష్ఠమైన తయారీ

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





M. Natarajan V. M. Omar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పొద్దు వాలింది, చేరాలి గమ్యం! రెండవ ఫోటో: ముద్దు లొలికే పాపకు, అంతా రమ్యం!

పంపినవారు : పి. పార్వతి, ఎం. జి. రోడ్, విజయనగరం—2 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

